విస్డమ్
అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక



## చందా వివరాలు

| | |
|---|---|
| 3 సంవత్సరాల చందా | రూ. 120/- |
| సంవత్సర చందా | రూ. 42/- |
| ఎయిర్ మెయిల్ (1 సం॥) | రూ. 200/- |
| సీ మెయిల్ (1 సం॥) | రూ. 100/- |

చందా పంపవలసిన చిరునామా
రత్నా ఏజన్సీస్
9, దేవకోట్, మైలాపూర్, మద్రాస్-600004
ఫోన్: 73327

## ఈ సంచికలో

జూన్ 1992



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
జగ్‌మోహన్

తెలుగు 'విస్డమ్'కు ఇది 11వ సం

# ధ్యానం

## ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును




ఆదర్శప్రేమ అంటే ఏమనుకున్నారు? "ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును, ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును." ప్రకృతిలో చుట్టూ ఉండే అన్ని విషయాలలోనూ, సంభవించే వివిధ సంఘటనలలోనూ మానవుడు నేర్చుకోదగిన గుణపాఠం ఒకటి అంతర్గతంగా ప్రకాశిస్తూ ఉంటుంది మానవుని నిత్య జీవితపు మానసిక క్షేత్రంలో నిశ్చయ ప్రమాణంతో ప్రవర్తించే ధర్మం వంటి పరమసత్యం వేరొకటి విశ్వంలో అసంభవం. జీసస్ నీతికథలు అన్నీ ఈ పరమసత్యాన్నే నిరూపిస్తాయి. ఇవి సామాన్య ప్రకృతి విషయాల నుండి గ్రహింపబడినవే. నిత్య జీవితంలో మానవుని మానసిక క్షేత్రంలో నాటిన ఆధ్యాత్మిక బీజాలు కృషి ఫలితంగా మొలకలెత్తి ఉత్తమ ఫలితాలను ఇస్తాయి. విత్తు కొద్దీ వృక్షం. సద్భావం, సద్వాక్కు, సత్క్రియ అనే బీజాలు నాటితే వాటికి

( మిగతా 3 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## వేళ పాటింపు

వేళపాటించడం ఒకమంచి అలవాటు. అందరూ అభ్యాసం చేసుకోవలసిన సద్గుణం వేళ పాటించే వ్యక్తి, పాటించని వ్యక్తులు చేసే పనికి రెట్టింపు పనిని తనకే కాకుండా, ఇతరులకు కూడా సంతృప్తి కరంగా చేయగలుగుతాడు. సరైనచోట, సరైనవేళకు మనం లేకపోతే అనేక అవకాశాలను చేయి జార్చుకోవలసి వస్తుంది సమయపాలన లోపిస్తే నీకు ఉద్యోగం ఇచ్చిన అధికారులకు సంతుష్టి ఉండదు నీవు అసమర్థుడవని, అజాగ్రత్త కలవాడవని, ఉదాసీనుడవని వారికి నీమీద ఒక దురభిప్రాయం ఏర్పడిపోతుంది



ఈనాడు ఒకవ్యక్తి సౌభాగ్యానికిగానీ, విజయానికిగానీ కాలమే కొలమానం. కాలం అంటే అమూల్యమైన ధనం కాబట్టి లభించిన అవకాశంలో ఇటువంటి అమూల్యమైన కాలాన్ని వివేకవంతంగా సద్వినియోగం చేసుకుంటే ఎంతైనా సాధించవచ్చు. కాబట్టి మనలో అందరూ ప్రతీ పనికి - వ్యాయామానికి, ఆహారానికి, విశ్రాంతికి, నిద్రకి వగైరా వివిధ పనులకు కాలాన్ని కేటా

"గుణగణాలను వివరిస్తూ ఉత్తముడు ఎలా ఉండాలో వాదిస్తూ కాలాయాపన చేయడం కంటే ఉత్తముడుగా ప్రవర్తించడం ఎంతో మేలు."

యించుకోవాలి ఆ కాలపట్టిక ప్రకారం వాటిని ఆచరించాలి

నియమించుకున్న కాలంలో చేయవలసిన పనిని ప్రారంభించి సకాలంలో పూర్తి చేయాలి. దీనివల్ల పనులు సక్రమంగా, సకాలంలో నెరవేర్చుకోగలుగుతాం - రోజూ నిద్రలేవడం తోటే నియమాలను పాటించకపోతే గొలుసు కట్టుగా ఆ రోజంతా ఏ పనులు పూర్తికావు అన్నిటికీ అంతరాయాలే కలుగుతాయి

ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు వేళపాటిం చాలని అనుకుంటే అక్కడికి కొంచెం ముందుగా వెళ్ళడానికి ప్రయత్నించాలి ఒక ఇంటర్వ్యూకి వెళ్లేటప్పుడు అనుకోకుండా ఏర్పడే ఆలస్యాలకు కొంత కాలాన్ని కేటాయించుకోవాలి ప్రయాణానికి పట్టే కాలం ఇంతనీ, రోడ్డు మధ్య ట్రాఫిక్ నిలిచి పోతే ఉజ్జాయింపుగా ఎంత ఆలస్యం అవుతుందో - ఇవన్నీ ఆలోచించు కోవాలి. సరైన ఎడ్రస్, వగైరాలను ముందుగా తెలుసుకోవాలి. చివరి నిమిషంలో చేరడం కంటే 10-15 నిమిషాలు ముందుగా వెళ్ళి ఆసమయంలో చుట్టు పక్కల అంగళ్ళు చూడడం, కాఫీ త్రాగడం వంటివి చేయవచ్చు. ముందుగా చేరితే అన్నీ సర్దుకోవచ్చు విశ్రాంతిగా కూర్చో వచ్చు మనసు స్థిమిత పరచుకోవచ్చు. సావధానత కలిగించుకోవచ్చు.

వేళ పాటించడం వల్ల వ్యక్తికి మంచి సామర్థ్యత, నిపుణత అలవడుతుంది. ఫ్రాన్స్ చక్రవర్తి అయిన నెపోలియన్ బోనాపార్టీ సక్రమ సమయపాలనే తన విజయ రహస్యం అని చెప్పుకుంటాడు. దేశపిత మహాత్మా గాంధీ కాలాన్ని ఖచ్చితంగా పాటించడం వల్లే చేపట్టిన ప్రతీ ఉద్యమంలోనూ విజయం సాధించగలిగారు

## ముచ్చటైన కథ



*థామస్ ఎడిసన్ ఒకసారి ఆరెంజ్‌లో న్యూ జెర్సీ స్టేషన్‌లో రైలు దిగి ప్లాట్‌ఫారం మీద నడుస్తూండగా సుప్రసిద్ధ కల్పనా చతురుడైన ఇతని మతిమరుపుతనం తెలిసిన స్టేషన్ మాస్టర్ 'హల్లో! ఎడిసన్, నీవు ఏదైనా మరచిపోయావా?' అని అడిగాడు దానికి ఎడిసన్ 'అన్నీ జాగ్రత్తగా ఉన్నాయనే నమ్మకం ఉంది' అంటూ సూట్‌కేస్‌లు లెక్క పెట్టుకుంటున్నాడు ఇంతలో రైలువైపు చూసాడు. సామానులు అక్కడ వదిలేసి తను కూర్చున్న కంపార్ట్ వైపు పరుగెత్తడం ప్రారంభించాడు. ఈ హడావిడి కంతా కారణం - వివాహం తరువాత హనీమూన్ పూర్తి చేసుకుని తనతో వస్తూన్న భార్యా మణి కంపార్టుమెంటులో ఉండిపోయింది కిటికీ నుంచి చూస్తుంది.*

*— 'అమెరికన్ ఒపీనియన్' సౌజన్యంతో*

( 2 వ పేజీ తరువాయి)

అనుగుణ్యమైన ఫలసాయాన్ని పొందుతావు. మానసిక క్షేత్రంలో ద్వేషభావాలను ప్రవృద్ధి చేసుకుంటే ఆత్మద్వేషం ఏర్పడు తుంది. ప్రేమబీజాలను నాటినవారు ప్రేమను అనుభవిస్తారు.

"కొలకోలలతో, హద్దు గీతలతో నరులు తమ భూములను పంపకం చేసుకోవచ్చు కానీ పైనున్న ఆకాశాన్ని ఎవరు పంచుకోగలరు?"

# తేనె ఆరోగ్యకరము-ఆయుష్కరము

శ్రీ రాఘవేంద్ర యోగీశ్వరులు

ప్రాచీన కాలం నుంచీ భారతీయులు తేనెను ప్రాణప్రదమైన ఆహారంగా ఉపయోగిస్తున్నారు మన ప్రాచీన వాఙ్మయంలో మిక్కిలి పురాతనమైన వేదాలలో దీని ప్రస్తావన ఉంది. తేనె ఆరోగ్యాన్ని చేకూర్చి ఆయుష్షును వృద్ధి చేస్తుంది కాబట్టి శుభ్రమైన పట్టు తేనె, ఆవునేతితో 3 1 నిష్పత్తిలో కలిపి పసిబిడ్డలకు బారసాల రోజున పట్టాలని ఋషులు నిర్ణయించారు.



పుష్పాలలో ఒక విధమైన తియ్యని ద్రవం లభిస్తుంది. దీనినే మకరందం (మధు) అంటారు తేనెటీగ వివిధ పుష్పాలనుండి తేనెను గ్రహించి కడుపులో ఉండే తేనె సంచిలో పెట్టుకుని జాగ్రత్తగా తేనెపట్టు వద్దకు తీసుకు వెళ్లి అందులో సేకరించి పెడుతుంది మకరందంలో 50 శాతం పైగా నీరు ఉంటుంది తేనెటీగలు తమ రెక్కలతో విసిరి మకరందంలో ఉండే తేమను చాలా వరకు ఆరబెడతాయి మిగిలిన భాగం కొన్ని రసాయనిక చర్యల వల్ల మధువుగా మారుతుంది. సాధారణంగా తేనెటీగల పరిశుభ్రత వల్ల ఈ మధువు కల్మషాలు లేక స్వచ్ఛంగా ఉంటుంది తేనె క్రిమినాశిని ఇందులో పడిన ఏకీటకమైనా వెంటనే మరణిస్తుంది. తేనె టీగలు వివిధ రకాలైన సువాసన పుష్పాలనుండి మకరందాన్ని సంగ్రహించి తేనెగా మారుస్తాయి వివిధ తేనెపట్టులలో వివిధ రకాల తేనెలు వివిధ రుచులతో, వాసనా వైవిధ్యంతో లభిస్తాయి

మకరందంలో చాలావరకు చెరకు చక్కెర అధికంగా ఉంటుంది. ఈ చక్కెర తేనెటీగ జఠరకోశంలో అరిగి ద్రాక్ష చక్కెరగా మారు తుంది బాగా తయారైన తేనెలో మామూలు చక్కెర చాలా తక్కువ శాతంలో ఉంటుంది. ద్రాక్ష చక్కెర మరియు ఫ్రక్టోస్‌లు అధిక ప్రమాణంలో ఉంటాయి దీనిలో A B C విటమినులు లభిస్తాయి అంతేగాక తేనెలో మాంసకృత్తులు, ఇనుము, సున్నము, రాగి, లవణము, క్లోరిన్ మరియు ఇతర ఖనిజ లవణాలు ఉంటాయి. మానవుని ఆరోగ్యాభి వృద్ధికి అవసరమైన పోషకాంశాలన్నీ తేనెలో ఉంటాయి పువ్వులలో ఆరోగ్యకరమైన జీవరసాల నుండి మకరందం తయారవుతుంది కాబట్టి దీనిలో తెలియని సద్గుణాలు అనేకం ఉన్నాయి తేనె శుభ్రం చేసి వండవలసిన అవసరం లేని ఆహారం మరియు ఔషధం.

## అన్ని క్రీడలు ఆరోగ్యకరమే

*క్రమపద్ధతిలో వ్యాయామం, ప్రతీరోజు 20-30 నిమిషాలపాటు చురుకుగా నడవడం, సైకిల్ తొక్కడం, ఈత మొదలైన వాటివల్ల శరీరంలో రక్తప్రసారం బాగా జరుగుతుంది రక్తనాళాల సాగుడు శక్తి రక్షింపబడుతుంది దేహంలోను, గుండెలోను వివిధ కండరాల సామర్థ్యత పెరిగి గుండెపోటు వ్యాధులు రాకుండా నివారింప బడుతుంది బాడ్‌మింటన్, గోల్ఫ్, హాకీ, కబాడీ మొదలైన క్రీడలన్నీ ఆరోగ్యాన్ని రక్షిస్తాయి*

"ఇంద్రియ నిగ్రహం కలవాడే వివేకవంతుడు."

తేనెటీగలు అరిగించుకున్న తేనెను సంగ్రహించి ఉంచి పిల్ల తేనెటీగలకు సులభంగా జీర్ణం కావడానికి ఇస్తాయి తేనె సేవించడం వల్ల కడుపులో వికారం ఉండదు. ఇది వెంటనే అరిగి రక్తంలో చేరి శక్తిని, సామర్థ్యాన్ని అధికం చేస్తుంది. మనం తినే అనేక ఆహార పదార్థాలను సులభంగా జీర్ణింపజేసే అద్భుతమైన జీర్ణకారి



THE HONEY-BEES

తేనెలోగల ఒక అపూర్వమైన పదార్థం రక్తంలో బైలు అనే పిత్తద్రవాన్ని తగ్గించి శుభ్ర పరుస్తుంది ఇది క్రొత్త రక్తాన్ని కలిగించి, శక్తిని వృద్ధిచేసి శరీరానికి ఒక విధమైన కాంతిని కలిగిస్తుంది తేనె క్రిమినాశిని కాబట్టి రోగకారకములైన క్రిములను నశింపజేసి శరీరంలో రోగ నిరోధక శక్తిని వృద్ధి చేస్తుంది తేనెలోగల ఖనిజ లవణాలలో ఇనుము, సున్నము ముఖ్యమైనవి ఇనుము రక్తంలో ఎర్ర కణాలను వృద్ధి పరచి శరీరానికి బలాన్ని చేకూరుస్తుంది. సున్నం గుండెను, ఎముకలను గట్టి పరుస్తుంది అందువల్ల తేనె అనేక హృద్రోగాలను, రక్తహీనతను, అనేక ఇతర రోగాలను పోగొడుతుంది దీంట్లో ఇతర పదార్థాలను చెడిపోకుండా నిల్వ ఉంచే మరోగుణం ఉంది. అందుచేత దూర ప్రదేశాలకు పంపబడే గ్రుడ్లు, విత్తనాలు, అంట్లు వగైరాలపైన తేనె పూస్తారు

శరీర చర్మాన్ని సంరక్షించి మృదువు పరచడానికి తేనెలో విశిష్ఠ గుణాలు విస్తారంగా ఉన్నాయి. అందుచేతనే దీనిని సాధారణంగా ఎక్కువ ఖరీదైన సబ్బులలో, ఫేస్ పౌడర్లలో, స్నోలలో మరియు ఫేస్ క్రీముల తయారీలో వాడతారు. తేనె సుఖ విరేచనకారి

ఈనాడు అందరూ ఏదోవిధంగా చెరకు చక్కెరను అధికంగా ఉపయోగిస్తారు. ఈ చక్కెర రక్తపు శక్తిని తగ్గించి రక్తంలో బైలు (పిత్త) రసాన్ని అభివృద్ధి చేస్తుంది. అధికంగా చక్కెరను ఉపయోగించేవారు దంతక్షయంతోను, డిస్పెప్టిక్ పుండ్లతోను బాధపడతారు. చక్కెరకు బదులు తేనెను ఉపయోగిస్తే మనదేశంలో ఈ వ్యాధులు చాలావరకు నివారించబడతాయి.

## విసిడమ్ పాత కాపీలు

*మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, జనవరి '85, మార్చి '85 నుంచీ జూలై '85; ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, జూన్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87 నుంచీ మే '87, జూలై '87, ఆగస్టు '87, నవంబరు '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89, జనవరి '90 నుంచీ డిసెంబరు '90, జనవరి '91 నుంచీ డిసెంబరు '91 కాపీలు మా వద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ 7.50 లు, 1985 కాపీల వెల రూ 8.00, 1986 కాపీల వెల రూ. 12 00, 1987 కాపీల వెల రూ.14 50 లు, 1988 కాపీల వెల రూ 18 75లు, 1989 కాపీల వెల రూ.24 50లు, 1990 కాపీల వెల రూ28 00లు; 1991 కాపీల వెల రూ.29 25లు రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 6 00 లు చేర్చి M O పంపాలి. 'రత్నా ఏజెన్సీస్', 9, దేశికా రోడ్డు, ఆళ్వారు పేట, మద్రాసు 600 004*

— సర్క్యులేషన్ మేనేజర్

డయాబిటిక్కు (మధుమేహం)ల ఆహారంలో తీపి పదార్థాలు నిషేధింపబడినా తేనె ఒకటి మాత్రం తీసుకోవచ్చుంటారు.

వుండ్ల తీవ్రతను తగ్గించే గుణం తేనెలో ఉండటంవల్ల వుండ్లకు ఉపయోగించే పట్లలో తేనె ఎక్కువగా కలపబడుతుంది. కాలిన వుండ్లకు తేనె రాస్తే శీఘ్రంగా మానిపోతాయి.




కండ్ల వ్యాధులకు తేనె అమోఘమైనది. రాత్రిపూట పడుకునేటప్పుడు మంచి తేనె రెండు చుక్కలు కంట్లో వేసుకుంటే కండ్లలో పెరిగిన దుర్మాంసాలు కరిగిపోతాయి. కండ్ల మంట, దురద, కండ్ల ఎరుపు మొదలైన వాటిని తగ్గించి మంచి దృష్టికి సహకరిస్తుంది. తేనెలో ఖర్జూరపు గింజను సానమీద అరుగదీసి ఆగంధాన్ని కండ్లకు కాటుకగా పెడితే కంట్లో పొరలు కరిగిపోతాయి.

సాధారణంగా మన ఇండ్లలో పిల్లలకు ప్రతీరోజూ ఆముదం పట్టించడం అభ్యాసం. దీనివల్ల విరేచనం అయినా పిల్లలకు నీరసం ఏర్పడుతుంది. అందుచేత తల్లులు ఈ అభ్యాసాన్ని మాని ఆముదానికి బదులుగా తేనెపట్టిస్తే శిశు మరణాలు చాలావరకు తగ్గుతాయి తేనె చిన్నపిల్లలకు మలబద్ధకం పోగొట్టడమే గాక శక్తి పెరుగుదలకు సహకరిస్తుంది. తేనె పిల్లలకు ప్రతీరోజూ పట్టిస్తే వాళ్ళకి త్వరగా మాటలు వస్తాయి చనుబాలతో పాటు పిల్లలకు తేనె ఇవ్వడం శ్రేష్ఠం.

పెద్ద పెద్ద తేనెటీగలు కొండలమీద, వాగుల లోను, అడవులలోను పెట్టే తేనెను 'కొండతేనె' అంటారు. గూళ్ళలోనూ, రంధ్రాలలోను, పాత ఇళ్ళలోను పెట్టే పట్లలో తేనెను 'పట్టు గూడు తేనె' అంటారు సాధారణంగా తోటలలో చెట్ల కొమ్మలకు పెట్టే తేనె పట్టు తేనెను 'పుడక తేనె' అంటారు. నేడు తేనెటీగలను పెట్టెలలో పెంచి గ్రుడ్లు, మైనం, చిన్న తేనెటీగలులేని శుభ్రమైన తేనెను తయారు చేస్తున్నారు. ఈ పెట్టె తేనె అన్ని తేనెలుకంటే శుద్ధమైనది.

తేనెను నీటిలో కలిపిగానీ, పండ్లరసాలలో కలిపిగానీ, పాలలో కలిపిగానీ తీసుకోవచ్చు బాగా వేడిచేసినవారు, వాంతులు అయ్యేవారు, జ్వరంతో ఉన్నవారు తేనెను ఉపయోగించ కూడదు తేనెను మట్టిపాత్రలలోగానీ, గాజు పాత్రలలో గానీ నిలవచేయడం ఉత్తమం ●

## ప్రత్యేక ఒలింపిక్ క్రీడలలో భారతీయ క్రీడాకారులు

*మానసికంగా వెనుకబడిన వారికోసం యుఎస్ఎ మిన్నెసోటాలోని మిన్నెపోలిస్-సెంట్ పాల్‌లో 1991 జూలైలో నిర్వహించిన అంతర్జాతీయ ప్రత్యేక ఒలింపిక్ క్రీడలలో భారతీయ క్రీడాకారులు అత్యద్భుతంగా క్రీడలను ప్రదర్శించి 20 బంగారు పతకాలను పొందారు ఆడ పిల్లల బాస్కెట్ బాల్ ఫైనల్స్‌లో భారతదేశపు పిల్లలు బాగా నైపుణ్యంగా ఆడి దక్షిణ అమెరికా ఈక్వడోరియన్స్‌ను 34-33తో ఓడించారు ఈనాడు మనదేశంలో 20,000 మంది మానసికంగా వెనుకబడిన క్రీడాకారులు 14 రాష్ట్రాలలో ఉన్నారు గత జాతీయ క్రీడలలో వివిధ క్రీడలలో మొత్తం 350 మంది బంగారు పతకాలు పొందగా అంతర్జాతీయ ప్రత్యేక ఒలింపిక్ క్రీడలలో 35 మందే పాల్గొన్నారు.*

—*'యుఎస్ఐఎస్' సౌజన్యంతో*

"ధర్మం కొంచమైనా భయాన్నుంచి కాపాడుతుంది."

# సరసోక్తులు

## నేను - మేము - నీవు

వ్యర్థ ప్రసంగి ఇతరుల గురించి మాట్లాడతాడు. బోరు చేసి విసిగించేవాడు తనను గురించి చెప్పుకుంటాడు.
సూక్ష్మబుద్ధితో సంభాషించే వాడు నీగురించి చెబుతూంటాడు.



## ఏ కొంతమందో వాటిని అలవాటు చేసుకుంటారు?

చాలామంది సద్గుణాలను ఏకరువు పెడుతూంటారు. కానీ మనలో చాలామంది వాటిని అలవాటు చేసుకోడానికి ప్రయత్నించరు.

— ఎడిసన్

## ఏది చూచినా భయమే!

మనం సత్యం అంటే భయపడిపోతాం అదృష్టం అంటే భయపడిపోతాం. మరణం అంటే భయపడిపోతాం. చివరికి పరస్పరం ఒకరినొకరు చూసుకుని కూడా భయపడి పోతూంటాం

— ఎమర్సన్

## ఒకదేశం ప్రగతి

దేశం ప్రగతి నిర్ణయింపబడేది ఆవేశం, పక్షపాతం మొదలైనవాటితో కట్టుబడిపోయే శాసన సభలలో కాదు నేరస్థులను తీర్పి దిద్దడం కంటే శిక్షించే న్యాయస్థానాలలో కాదు. మానవులందరూ యంత్రాలులాగ పనిచేసే కర్మాగారాలలోకాదు - భావి ప్రజానీకాన్ని రూపొందించే పాఠశాలలోనే దేశం ప్రగతి ఆధారపడి ఉంటుంది

## అమెరికా స్వాతంత్ర్య ప్రకటన


Jefferson

అమెరికన్ స్వాతంత్ర్య ప్రకటనను డ్రాఫ్టు చేసినప్పుడు థామస్ జెఫర్సన్‌కి 33 సంవత్సరాల వయస్సు. 'పూర్ రిచర్డ్స్ అల్మెనాక్' రచించినప్పుడు బెంజమిన్ ఫ్రాంక్లిన్‌కి 26 సంవత్సరాల వయస్సు. 'పిక్‌విక్ పేపర్స్' వ్రాసినప్పుడు ఛార్లెస్ డికెన్స్‌కి 24 సంవత్సరాలు, 'ఆలివర్ ట్విస్ట్' వ్రాసినప్పుడు 25 సంవత్సరాలు 'రీపర్‌'ను కనిపెట్టినప్పుడు మాక్‌కార్మిక్‌కి 23 సంవత్సరాలు భూమ్యాకర్షణ సూత్రాలను సూత్రీకరించినప్పుడు న్యూటన్‌కి 24 సంవత్సరాల వయస్సు

"బుద్ధి కలిగి ఉండడమే యోగం."

## దానిమీదే కూర్చున్నా - అది బంగారు గని అని తెలుసుకోలేదు

దక్షిణ ఆఫ్రికాలో ఒక డచ్‌రైతు తన పొలం సరిహద్దులో ఉన్న పెద్దరాతిబండ మీద కూర్చుని నిస్సారంగా బీడువడిపోయిన తన పొలాన్ని గురించి ప్రతిరోజూ యోచిస్తూ ఉండేవాడు. చివరకు దానిని 25,000 డాలర్లకు అమ్మి సంతృప్తి పడ్డాడు. ఆ రైతు కూర్చుని ఆలోచించే అరాతి బండ క్రింద ఒక బంగారవు గనిని ఆ పొలాన్ని కొనుక్కున్న కామందు కనుగొన్నాడు.

## మూడే బుసలు కొడతాయి!

ఒకసారి ఛార్లెస్ లాంబ్ ఒక సభలో మాట్లాడు తూండగా ఎవరో బుసకొట్టినట్లు 'ఉస్ ఉస్' అన్నారు. చార్లెస్ లాంబ్ గంభీరంగా, శాంతంగా 'మూడే బుసలు కొడతాయి- బాతు, పాము, అవివేకి - ఎవరో ఆ బుస కొట్టేది ముందుకు రండి' అని అన్నాడు

## సమయ పాలన వల్ల చిక్కు!

అసలు సమయపాలనవల్ల కలిగే చిక్కు ఏమిటంటే పదింటికి తొమ్మిదిసార్లు అభినందించే వారు ఎవరూ ఉండరు!

## ఎవరు వృద్ధుడు?

ఎవరు వృద్ధుడు అనే ప్రశ్నకు 80 సంవత్సరాల ఎల్డర్ స్టేట్స్‌మాన్ బెర్నార్డ్ బారుచ్ 'నాకంటే 10 ఏళ్లు పెద్ద ఎవరైతే, వారు' అన్నాడు!

## గంభీరత లేకపోయినా పొడవు పెంచుతారు

మహోపన్యాసకుల ఉపన్యాస ధోరణిలో గంభీరత లోపిస్తే సుదీర్ఘంగా పొడవు పెంచుతారు.

## నాయకుడు మార్గం చూపిస్తాడు

*జాన్ మెకాబే 20 వేల మంచి యోధులను యుద్ధానికి ఎన్నుకున్నాడు వారు కెండెబియస్‌పై దాడి సలిపారు. ఒకనది దగ్గరకు వెళ్లేటప్పటికి వారు అది దాటడానికి భయపడుతున్నారని గ్రహించి మొట్టమొదట అతనే దాటాడు అతడి సైన్యం అది చూచి అతడిని అనుసరించి శత్రువుని జయించారు*

## సూర్యకాంతి చికిత్స



*మంచి తీక్షణమైన సూర్యకాంతితో సుమారు 300 మందికి దగ్గు, ఒగర్పు, న్యూమోనియా మరియు ఇతర హృదయ సంబంధమైన వ్యాధులను తాష్కెంట్‌లో సెమాష్కొ హెల్త్ రిసార్ట్ అండ్ ఫిజియో థెరపీ పరిశోధక సంస్థ గుణపరచింది ఈ సూర్య కాంతి కాన్‌సెంట్రేటర్లకు సమానమైనవి ప్రపంచంలో మరోచోట ఎక్కడా లేవు వీటిని ఉజ్ బెకిస్థాన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిజిక్స్ అండ్ టెక్నాలజీ ఆఫ్ ది ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు అభివృద్ధిపరచారు*

*ఒక కాన్‌సెంట్రేటర్‌లో పెద్ద అండాకారంలో (పెరబాలోయిడ్) లాంగ్ ఫోకస్ అద్దం ఉంటుంది దీని అర్ధవ్యాసం 75 సెం.మీ.లు రోగి కూర్చోడానికి గది తిరిగే ప్లాట్‌ఫారం మీద అమర్చబడింది రోగి మీదికి ఒక సూర్యకిరణాన్ని నిమిషానికి 60 మొదలు 120 వల్బులు వరకు ప్రసరింపజేయవచ్చు.*

# ఈ శతాబ్దంలో

## భారతదేశంలో మొట్టమొదటి ఓపెన్ హార్ట్ శస్త్రచికిత్స

మొట్టమొదటి ఓపెన్ హార్ట్ శస్త్రచికిత్స భారత దేశంలో 1962లో సి.ఎమ్.సి హాస్పిటల్ (వెల్లూర్, తమిళనాడు)లోను మరియు ఎస్.ఎస్.కె.ఎమ్ హాస్పిటల్ (కలకత్తా)లోను చేయబడింది

## డిస్నీలాండ్




ప్రఖ్యాత అమెరికన్ సినీమా నిర్మాత వాల్ట్ డిస్నీ 17 మిలియను డాలర్ల వ్యయంతో 160 ఎకరాల మైదానంలో ఫాంటసీ అండ్ ఫన్ (కాల్పనిక మరియు వినోదం) డిస్నీలాండ్‌ను 1955 జూలై 18న యునైటెడ్ స్టేట్స్ కాలిఫోర్నియాలో అనాహీమ్‌లో స్థాపించాడు.

## మొట్టమొదటి యూరోపియన్ కపాల శిలాజం

ఛార్లెస్ డాసన్ 1912 డిసెంబరు 18న మొట్టమొదటి యూరోపియన్ పిల్ట్‌డౌన్ మాన్ - కపాల శిలాజం మరియు ఇతర అవశేషాలను కనుగొన్నట్టు చెప్పాడు. ఇది మనిషి వంటి కోతి - ఒరంగుటాన్ కపాలము!

## ఆస్ట్రేలియా కామన్‌వెల్త్

ఆస్ట్రేలియా కామన్‌వెల్త్ 1901 జనవరి1న స్థాపించబడింది దీనికి మొదటి ప్రధాన మంత్రి ఎడ్మండ్ బార్టన్

## చందర్‌నగర్ పశ్చిమబెంగాల్‌లో చేర్చబడింది

పశ్చిమ బెంగాల్ (భారతదేశం)లో ఫ్రెంచి సెటిల్మెంట్ చందర్‌నగర్ పౌరులు ప్రజాభిప్రాయంతో ఇండియన్ యూనియన్‌లో చేరడానికి 1949 జూన్ 19 న నిర్ణయించుకున్నారు ఫ్రాన్స్ చందర్‌నగర్‌ను 1951 లో భారతదేశానికి బదలాయించింది 1954 మే 8న భారత ప్రభుత్వం చందర్‌నగర్‌ను పశ్చిమబెంగాల్‌లో విలీనం చేయడానికి నిశ్చయించింది

## డిస్క్ మీద ఒక ప్రక్క పాట రికార్డు చేసిన మొదటి భారతీయ వనిత

కలకత్తా క్లాసిక్ థియేటర్‌కు చెందిన ఒక శశిముఖి 1902లో 25 సెం.మీ.ల డిస్క్ మీద ఒక ప్రక్క (one-sided disc) పాట రికార్డు చేసిన మొదటి భారతీయ వనిత 'కష్టా జీవన్ ధన్' అనే ఈ పాట శ్రీకృష్ణ నాటకం లోనిది.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద చాక్‌లేట్ ఫాక్టరీ

పెన్సిల్వేనియా (యుఎస్ఎ)లో హెర్షే ఫుడ్స్ ఇన్‌కార్పొరేట్ ఆఫ్ హెర్షే వారు 1905లో ప్రపంచంలోనే పెద్ద చాక్‌లేట్ ఫాక్టరీని నిర్మించారు.

"జ్ఞానంతో సమానమైన పవిత్ర వస్తువు ఇంకొకటి లేదు."

## ప్రపంచపు మొట్టమొదటి టైడల్ పవర్ స్టేషన్

ఫ్రాన్స్ అధ్యక్షుడు చార్లెస్ డి గాలె 1966 నవంబరు 26న బ్రిట్టనీలో (Brittany) ప్రపంచపు ప్రప్రథమ తరంగ విద్యుత్ కేంద్రం (టైడల్ పవర్ స్టేషన్) ప్రారంభించారు.

## ప్రప్రథమ అణు యుద్ధనౌక

14,000 టన్నుల క్రూయిజర్ యుఎస్ఎస్ లాంగ్ బీచ్ అనే ప్రప్రథమ అణు యుద్ధనౌక (nuclear warship) 1959 జూలై 14న ప్రారంభింపబడింది.

## భక్రానంగల్ బహుళార్థ సాధక నదీలోయ పథకం



Nehru

భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ 1962 అక్టోబరు 22న దేశానికి భక్రానంగల్ బహుళార్థ సాధక నదీలోయ యోజనను అంకితం చేసారు. భక్రా ఆనకట్ట నిర్మాణానికి ఉపయోగించిన సిమెంట్ ప్రాచీన ఈజిప్ట్ దేశపు ఏడు పెద్ద పిరమిడులను నిర్మించడానికి అవసరమైన సిమెంటుకు మూడు రెట్లు ఉంది.

## అమెరికన్ కల్పనా చతురుని మరణవార్త



ప్రఖ్యాత అమెరికన్ కల్పనా చతురుడు థామస్ ఆల్వా ఎడిసన్ మరణించిన మరునాడు అతడి మరణ వార్త 1931 నవంబరు 19న న్యూయార్క్ టైమ్స్ పత్రికలో 4 1/2 పుటలు ఆవరించింది.

## అవగాహన

ఎవరూ ఎవరినీ పూర్తిగా అవగాహన చేసుకోరు. ఇద్దరు ప్రాణమిత్రుల మధ్య వ్యక్తిత్వం అనే తెర అడ్డు ఉండటం వల్ల పరస్పరం పూర్తిగా తెలుసుకుని ఉండరు. అర్ధ శతాబ్దం పాటు భార్యాభర్తలు ఇద్దరూ చేరి నివసిస్తారు. వీరిలో ఎవరైనా మరణించినప్పుడు ఇంకొకరికి ఈ ఏభై సంవత్సరాలలో కనీవినీ ఎరుగని శీలం, భావం తెలిసివస్తుంది. మన ప్రాణస్నేహితుని గురించి 'పరిపూర్తిగా' తెలుసుకున్న దాకా వారిని గురించి తెలుసుకోలేము. ఏ ఇతర వ్యక్తి కంటే భగవంతుడు మానవునికి పూర్తిగా అవగాహన చేసుకున్న మిత్రుడు.

"హాస్యాన్ని ఆస్వాదించలేని మనిషి బ్రతుకు దుర్భరం."

# పిల్లలకు ఇల్లే ఉత్తమ శిక్షణాకేంద్రం

షామ్ సుద్దీన్

ఒక శిశువు పుట్టీ పుట్టడంతోనే ఇంటిని ఆశ్రయించి క్రమక్రమంగా పెరుగుతూ మాట్లాడటం, నడవడం నేర్చుకోడానికి ప్రారంభిస్తాడు. సాంఘిక లేక సామాజ జీవితంలో ఉత్తమ శిక్షణను పొందడానికి ఆధార మైన కుటుంబంలో జీవిస్తాడు. ఇక్కడే శారీరకంగా,



మానసికంగా మరియు సాంస్కృతికంగా ప్రవృద్ధి పొందడానికి ఆ శిశువుకి అన్ని అను కూలాలు, అవకాశాలు లభిస్తాయి. ఇక్కడే పెద్దవారు చెప్పిన మాట విని నడచుకోడానికి, వారికంటే చిన్నవారికి సహాయం చేయడానికి పిల్లలకు శిక్షణ ఇవ్వబడుతుంది. ఇంట్లోనే పిల్లలు ఇతర కుటుంబ వ్యక్తులతో అన్ని బాధ్యతలను విభజించుకుంటూ పెరిగి పెద్ద వారవుతారు.

ఇంటి కుటుంబంలో ఇతర వ్యక్తుల వలెనే పిల్లలు కుటుంబ సంబంధమైన సాంఘిక, ధార్మిక కార్యకలాపాలలో పాల్గొనాలి. సహ కారం, సద్భావం, సుహృద్భావం, ఆత్మత్యాగం వగైరా సద్గుణాలు అతనిలో సహజంగా వృద్ధి పొందుతాయి. సాంఘిక, నైతిక శీలం ఏర్పడు తుంది. ఇంట్లో నేర్చుకున్న నడవడి అతనితో పాటు జీవితాంతం ఉంటుంది.

ఈ విధంగా ఇల్లు ఒక అద్భుతమైన విద్యా కేంద్రంగా పిల్లలకు సహకరిస్తుంది. ఇటీవలి పారిశ్రామిక, వైజ్ఞానిక ప్రగతి వలన జనం వివిధ వ్యాపారాలలో నిమగ్నులై ఈ ముఖ్య బాధ్యతలను ఇతర ప్రత్యేక సంస్థలకు విడిచి పెట్టవలసి వచ్చింది. దీని ఫలితంగా తలిదండ్రులకు తమ పిల్లలని గురించి శ్రద్ధ తీసుకోడానికి తగిన అవకాశం కలగడం లేదు. పిల్లల విద్యాభివృద్ధి కోసం ప్రత్యేకంగా విద్యా సంస్థలు ఏర్పాటు చేయవలసి వచ్చింది.

బాల్య దశవు ప్రథమావస్థలో పిల్లల కార్య కలాపాలు కుటుంబానికి పరిమితమై ఉంటాయి. కాబట్టి పిల్లల నిర్మలమైన లేత మనస్సులలో గృహ వాతావరణం హత్తుకుపోయి ఉంటుంది. ఇంటి వట్టునే పిల్లలకు సహజంగా స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, ప్రేమ, అనురాగం, సంరక్షణ అనేవి ఏర్పడతాయి. ఇంట్లో చిన్నతనంలో అభ్యసించిన మంచి అలవాట్లే ప్రేమ, సత్యం, న్యాయం, ఆత్మత్యాగం అనే సద్గుణాలుగా మారతాయి.

పిల్లలలో సక్రమ పద్ధతిలో ప్రణాళికాబద్ధమైన ప్రభావం కలిగించడమే విద్య యొక్క ముఖ్య ఆశయం. ఇది ముఖ్యంగా స్కూళ్లు లేక విద్యా సంస్థలలో ఉపాధ్యాయుని ద్వారా జరిగినా స్కూలులో చేరడానికి ముందే పిల్లల మీద ఇంటి ప్రభావం కొంతవరకు ఉంటుంది. కళాశాల మరియు పాఠశాలలలో ఉపాధ్యాయులు దీనిని మరింత పరిపుష్టవంతం చేయాలి.

ఈనాడు విద్యార్థుల యొక్క బాధ్యత పాత

"హాస్యప్రియత్వం ఉన్న వ్యక్తి తాను హాయిగా జీవిస్తాడు. తన చుట్టూ ఉన్నవారికి హాస్య పరిమళాలు పంచి వారి బ్రతుకులను నందనవనాలు చేస్తాడు."

శాలలకు బదిలీ చేయబడినా వారి సామాజిక వాతావరణానికి ఇల్లే ముఖ్య పాత్ర వహిస్తుంది బాలుర ప్రత్యేక ఆదర్శసాధనకు వారిపై ఇంటి ప్రభావం ఎక్కువగా ఉంటుంది

ఇంట్లో అవలంబించవలసిన ధర్మాలు, బాధ్యతలు అనేకం ఉంటాయి బాలుర శారీర కాభివృద్ధికి ఇల్లు పూర్తి బాధ్యతను తీసు కోవాలి మంచి పుష్టికరమైన ఆహారం సకాలంలో



ఇస్తూండాలి. బట్టలు, ఇతర సౌకర్యాలు, ఆటలు వగైరాల గురించి జాగ్రత్త వహి స్తూండాలి. పరిశుభ్రత అలవాటు చేయాలి. సక్రమ వ్యాయామానికి, శుభ్రమైన గాలి పీల్చడానికి, విహారానికి తగిన ఏర్పాట్లు కలిగిస్తూండాలి.

మొట్టమొదట క్రొత్త క్రొత్త విషయాలను చూచి వాటిని గురించి తెలుసుకోడానికి పిల్లలలో ఉత్సాహం అధికంగా ఉంటుంది. అందుచేత వాటిని గురించి వారు వివిధ ప్రశ్నలను అడుగు తూంటారు. వివేకవంతులైన తలిదండ్రులు వాటికి తగిన సమాధానాలు ఇస్తూంటారు. తెలుసుకోవాలనే పిల్లల ఉత్సుకతను తీరుస్తారు. దీనివల్ల పిల్లల గ్రహణశక్తి, సంభాషణా నైపుణ్యాం అభివృద్ధి చెందుతాయి.

సాధారణంగా పిల్లలను ఇంట్లో అశ్రద్ధ చేస్తారు. ఇది ఆరోగ్యకరం కాదు పిల్లల క్రియాశీలతకు తగినంత ప్రాముఖ్యత ఇవ్వాలి. అంతేగాక వయస్సును బట్టి తగినట్టుగా గృహ కృత్యాలలో పాల్గొననిచ్చి వివిధ సంస్థలలో వివిధ బాధ్యతలను వహించగలిగేటట్లు తీర్చిదిద్దాలి నిరంతర సాధన, మంచి అలవాట్లు ఫలితంగా వారిలో శీలాభివృద్ధి కలుగుతుంది ఇతరుల కోసం త్యాగం చేస్తారు

చిన్నతనంలో ఆటలు అధికంగా ఉంటాయి దానికి తగిన చిలిపిచేష్టలు కూడా అధికంగా ఉంటాయి తలిదండ్రులు పిల్లలలో ఇటు వంటి వాటిని జాగ్రత్తగా పరిశీలిస్తూ వారికి తగినంత అవకాశం కల్పిస్తూ ఉండాలి. ఇంట్లో

## వైజ్ఞానిక మార్గం గొప్పది




విజ్ఞానం నేడు మనం ఒక భౌతిక స్వర్గాన్ని నిర్మించుకోడానికి మనకు సహకరిస్తుంది ఈ విజ్ఞానం ప్రపంచాన్ని సర్వనాశనం చేసి భయంకరమైన నరకకూపంగా కూడా మార్చగలదు. నీవు దేన్ని కోరుకుంటావు - భౌతిక స్వర్గాన్నా? భయంకరమైన నరకాన్నా? మానవ మనస్సు, మానవ స్ఫూర్తి దీనిని సక్రమ మార్గంలో నియంత్రించాలి గొప్పదైన వైజ్ఞానిక మార్గాన్ని ఆధ్యాత్మిక తత్త్వం సరైన ప్రమాణాలు, సరైన దృష్టి కోణాలతో పటిష్ఠవంతం చేస్తాయి.

— జవహర్‌లాల్ నెహ్రూ

"మానవజాతి మీద నమ్మకాన్ని వదలవద్దు. అది మహా సముద్రం లాంటిది. సముద్రంలో కొంత నీరు మలినం అయినంత మాత్రాన ఆ మలినం ఎప్పటికీ సముద్రమంతా వ్యాపించదు."

పిల్లల సహజ శక్తులను, సామర్థ్యాలను గ్రహిస్తూ వారి అభిమాన మార్గంలో వారికి ప్రోత్సాహం కలిగిస్తూ ఉండాలేగానీ నిర్బంధ బోధనలు, ఆదేశాలు ఇవ్వకూడదు పిల్లల శారీరక, మానసిక, సాంస్కృతిక, ప్రాతిపదిక ఇంట్లోనే ఏర్పడుతుంది పిల్లల భావిశీల నిర్మాణానికి ఇల్లే సహకరిస్తుంది.

పాఠశాలలో విద్యార్థి అనేకమందిలో ఒకడుగా ఉంటాడు కాబట్టి వ్యక్తిగత అవసరాలకు, శక్తి సామర్థ్యాలకు తగినంత శ్రద్ధ తీసుకోడానికి అవకాశం ఉండదు. దీనికి ఇల్లే ఉత్తమోత్తమమైన ప్రదేశం. తలిదండ్రులు వ్యక్తిగతమైన శ్రద్ధ తీసుకుని శీలాభివృద్ధికి సహకరించగలరు

సాధారణంగా పిల్లలు గృహ పరిసర వాతావరణంలో ఉన్నా బయట ప్రపంచాన్ని తెలుసుకోవాలనే ఉత్సాహం అధికంగా ఉంటుంది. తలిదండ్రులు దీనిని గ్రహించడం వారి ధర్మం. పిల్లల మానసికాభివృద్ధికి తగిన అవకాశాలను, అనుకూలాలను కల్పిస్తూండాలి. పిల్లల అభిరుచికి తగినట్లుగా పుస్తకాలు, వార్తా పత్రికలు, మాగజైనులు అందజేస్తూండాలి. బయట తోటలలో, వర్కు షాపులలో తిరుగుతూ పరీక్షించి తెలుసుకోడానికి తగిన ఏర్పాట్లు కలిగిస్తూండాలి. వాస్తవంగా ఇక్కడే పిల్లల అభిరుచులు, ఇష్టాలు, స్వభావాలు తెలుస్తాయి.

కానీ కుటుంబాలలో కొన్ని అనానుకూల పరిస్థితుల వల్ల లేక తలిదండ్రుల ఇతర ఇబ్బందుల వల్ల, ప్రతిబంధకాల వల్ల ఇంట్లో పిల్లలకు తగిన వాతావరణం లోపిస్తూంది. అటువంటి సమయాలలో తలిదండ్రులు తమ పిల్లలను ఇన్ఫెంట్ స్కూళ్లకు, కిండర్ గార్టెన్ స్కూళ్లకు లేకపోతే వ్యక్తిగతాభివృద్ధికి అనుకూలాలు ఉన్న బోర్డింగ్ వసతి గృహాలకు పంపాలి.

పిల్లల విద్యా విషయంలో ఇల్లు, పాఠశాల కూడా సమాన పాత్ర వహిస్తాయి. ఒకదానికి ఒకటి పరస్పర పరిపూరకంగా ఉంటాయి ఇంట్లో ప్రాతి పదిక పునాది నిర్మించబడితే పాఠశాలలో దానిపై భవిష్యత్తు నిర్మాణం జరుగుతుంది ఇంట్లో తలిదండ్రుల బాధ్యత అధికమైనా పిల్లల పరిపూర్ణాభివృద్ధికి ఇల్లు, పాఠశాలల మధ్య పరస్పర సహకారోద్యమం ఉండాలి

— 'స్వాస్థ్ హింద్' సౌజన్యంతో

## చిత్తవృత్తికి హాని కలిగించకు



*ఒక వ్యక్తి పొరపాటుని అభినయంతో భావ సూచకమైన అంగవిక్షేపంతో తెలియజేయవచ్చు. దానికీ నోటితో చెప్పినంత బలం ఉంటుంది కానీ "నీవు పొరబడుతున్నావు" అని నోటితో చెప్పి నీతో ఒప్పించగలవా? లేవు ఎందుకంటే నువ్వు సూటీగా ఆ వ్యక్తి బుద్ధి లేక తెలివితేటలకి హాని కలిగించిన వాడవు అవుతావు. దీనివల్ల ప్రతీకారానికి ప్రారంభిస్తాడు. అంతేగాని అతని మనస్సు ఎంతమాత్రం మార్చలేవు. నీవు ప్లేటో సిద్ధాంతాలు ఎన్ని చెప్పినా, ఇమ్మాన్యువల్ కాంట్ తర్కం ఎంత చెప్పినా ఆ వ్యక్తి మనస్సును మార్చలేవు, ఎందుకంటే అతడి చిత్తవృత్తికి హానికలిగించావు కాబట్టి*

— *డేల్ కార్నీజ్*

"ప్రపంచంలో సర్వోత్తమమైన ఆశయం స్వాతంత్ర్యం."

# ఉల్లి చేసే మేలు

డా. పి.జి. చిన్నకృష్ణన్

ఉల్లి ఆరోగ్యానికి చాలా మంచిది. వెల్లుల్లి లాగే ఉల్లి లేక నీరుల్లి కూడా గడ్డ జాతికి చెందినది. 100 గ్రాముల ఉల్లిగడ్డలో 10 గ్రాములు పిండి సంబంధమైన కార్బో హైడ్రేటులు, 1 3 గ్రా.లు ప్రోటీనులు (మాంసకృత్తులు), 0.4 గ్రాములు కొవ్వు పదార్థాలు లభిస్తాయి.




దీనియందు సున్నం, సోడియం, పొటాషియం, భాస్వరం, అధిక భాగం గంధకం మరియు దాని సంబంధమైన ఇతర వ్యుత్పన్నములు (derivatives) ఉంటాయి. తేనె, అల్లపు రసం చేర్చిన ఉల్లి ఆమశంకకు దివ్య ఔషధం. ఉల్లిలో విటమిను 'A' అధికంగా ఉంటుంది. ఇవి పచ్చివి తింటారు లేక వంటకాలలో ఉపయోగిస్తారు.

ఉల్లిపాయలలో పీచు అధికంగా ఉంటుంది. అందుచేత మలబద్ధ నివారణకు మంచి ఔషధంగా పనిచేస్తుంది. వీటియందు గంధకం ఉండడం వల్ల ఆంటీ బయోటిక్ (anti-biotic) ప్రభావం అధికంగా ఉంటుంది తేలు కుట్టి నప్పుడు కుట్టినచోట అర్ధకోసిన ఉల్లిపాయ రుద్దితే బాధ తగ్గుతుంది.

డయాబిటిక్కులకు, అధిక రక్తపు పోటు గలవారికి ముఖ్యంగా బియ్యపు కడుగుతో ఉల్లిని ఉపయోగిస్తే ఎంతో మేలు చేస్తుంది. ఉల్లిపాయలలో ఆంటీ కొలెస్ట్రాల్ ప్రభావం ఉన్నట్టు బ్రిటన్‌లో వైద్యులు కనుగొన్నారు భారతదేశంలో చాలామంది పులావ్ లేక బిరియానీ తిన్నప్పుడు కొలెస్ట్రాల్ తగ్గడానికి ఉల్లిపాయను పెరుగులో కలిపి తింటారు

●

## ప్రత్యేక అంతర్జాతీయ ఒలింపిక్ క్రీడలు

*యునైటెడ్ స్టేట్స్ మిన్నెసోటా మిన్నీపోలిస్ సెంట్ పాల్‌లో బంగ్లాదేశ్, ఈజిప్ట్ ఇండియా, ఇజ్రేల్, జోర్డాన్, లెబనాన్, నేపాల్, పాకిస్థాన్, సౌదీ అరేబియా, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌ల నుండి వచ్చిన 120 క్రీడాకారులు 90 దేశాలనుంచి వచ్చిన మానసికంగా వెనుకబడిన 6,000 క్రీడాకారులలో ఉన్నారు. వీరు 1991 జూలై 20 నుండి 27 వరకు నిర్వహింపబడిన అంతర్జాతీయ ప్రత్యేక ఒలింపిక్ క్రీడలలో పాల్గొన్నారు 'ట్విన్-సిటీ'లో ఏర్పాటైన 16 క్రీడలలో తమ వ్యక్తిగత విజయసిద్ధిని, అభిలాషను ప్రదర్శించడానికి మాత్రమే వీరు పాల్గొన్నారు. యశస్సుగానీ, ధనము గానీ ఆశించి కాదు. ఈ ప్రత్యేక ఒలింపిక్స్‌ను జాన్ ఎఫ్.కెన్నెడీ సోదరి యునిస్ కెన్నెడీ ష్రైవర్ మానసికంగా వెనుకబడిన వారికి మొట్టమొదట 1968లో చికాగో (యు.ఎస్.ఎ)లో నిర్వహించింది. —'యు.ఎస్.ఐ.ఎస్.' సౌజన్యంతో*

"మతం మనిషి కోసం గాని, మనిషి కోసం మతం కాదు."

— డా. అంబేద్కర్

# అపురూపమైన ఇటలీ వయొలిన్

ఎన్.కె.ఖర్గా

సుమారు 1150 స్ట్రాడివేరియస్ వయొలిన్‌లలో నేడు అక్కడక్కడ ప్రపంచం వివిధ దేశాలలో ఏ కొద్దిమంది వాద్య నిపుణుల చేతులలోనో ఉన్నాయి.




Stradivarius

ఆంటోనియస్ స్ట్రాడివేరియస్ అనే పేరు విననివారు చాలా అరుదు. 17వ శతాబ్దంలో ప్రఖ్యాత నిపుణుడు తయారుచేసి అభివృద్ధి పొందించిన స్ట్రాడివేరియస్ వయొలిన్ కలిగి ఉండటం, దానిని వాయించడం గొప్ప అదృష్టమని చెప్పుకోవాలి ఆంటోనియస్ స్ట్రాడివేరియస్ ఇటలీలో క్రిమోనా పట్టణంలో వయొలిన్‌ను తయారుచేసే ఒక నిపుణుడు ఇతడు 1644 ADలో జన్మించాడు. జీవితంలో చాలాభాగం ఒక కర్ర ఇంట్లో నివసిస్తూ 1,300 వయొలిన్‌లు, వయోలాలు, సెల్లోలు నిర్మించి నిర్దుష్టపరచాడు. ఇతడు 93 సంవత్సరాలు జీవించి 1737 డిసెంబరులో మరణించాడు. కర్రను చెక్కే వడ్రంగి పని మాత్రమే కాదు వయొలిన్‌లో ప్రతీ భాగం ప్రత్యేకంగా పరీక్ష చేసి జాగ్రత్తగా దానిపై పనిచేసేవాడు. ఇది ఒక గొప్ప కళ. ఇతడికి ఒక అపూర్వ సృజనాత్మక దృష్టి, ఒక అపూర్వ గాయకుని శ్రవణశక్తి ఉన్నాయి తరువాత ఇతడి వయొలిన్‌లను వైజ్ఞానికంగా పరీక్ష చేసినప్పుడు-తంత్రులు లేకుండా కూడా వీటిని వాయించినప్పుడు సంగీత స్వరాలు పలికేవి అని నిరూపించబడింది పియానోఫోర్టే మధ్య 'సి' స్వరం (middle 'C' of the pianoforte) పలికేది. ఇటలీ మరియు జర్మనీలలో వయొలిన్‌లను తయారుచేసే నిపుణులు ఇంకా ఎంతోమంది ఉన్నారు.

## మొట్టమొదట ఫుట్‌బాల్ క్రీడ చైనీయులు ఆడారు



*మొట్టమొదట BC 350లో చైనీయులు ఫుట్‌బాల్ క్రీడను ఆడారు దీనిని వారు 'ట్సు చు' (Tsu chu) అన్నారు ఇంగ్లండ్‌లో 12వ శతాబ్దం వరకు దీనిని ఆడలేదు. 1846 నుంచి ఫుట్‌బాల్ క్రీడల నియమాలు, నిబంధనలు ఆచరణలో ఉన్నాయి.*

"మనుష్యుల మధ్య, మనుష్యుల కోసం జీవించడం మంచితనం."

— టాల్‌స్టాయ్

మంచి రకం ముఖ్యంగా ఇటాలియన్ వయొలిన్‌లకు గల వ్యామోహం వల్ల ప్రపంచం అంతా వయొలిన్ తయారీదారులు ప్రఖ్యాత నిపుణుల తయారీలను కాపీ చేయడం ప్రారంబించారు కానీ వాటికి ఇటాలియన్ వయొలిన్‌లకు గల శబ్దం, స్వరమాధుర్యం ఉండదు అందుచేత శాస్త్రజ్ఞులు ఇటలీ క్రిమోనా వయొలిన్ సృష్టించడానికి గణిత సూత్రాలను సూత్రీకరించారు దీనిని అనుసరించి కొన్ని వయొలిన్‌లు తయారు కాబడ్డాయి నిరంతర పరిశోధనా కృషి ఫలితంగా వయొలిన్‌లను ఫాక్టరీలో భారీ ఎత్తున తయారుచేయడానికి, వాటికి ఉపయోగింపబడే వస్తు సామగ్రిని మార్చుటకు కూడా ప్రయత్నాలు జరిగాయి.

నిపుణుల వయొలిన్‌లు గాని, శాస్త్రయుక్తమైన వయొలిన్‌లు గాని సరిగ్గా లేవని కాదు ప్రాచీన కాలపు క్రిమోనా వయొలిన్‌లకు ఇవన్నీ తీసికట్టే

వయొలిన్ నిర్మించినవారు ప్రాచీన చైనాకి చెందినవారు వీరు పియర్ గింజ రూపంలో మధ్యయుగపు అరబ్బుల రెబెక్‌ను తయారు చేసారు మొట్టమొదట ఆధునిక వయొలిన్‌లు 16 వ శతాబ్దంలో తయారు చేయబడ్డాయి. 17వ శతాబ్దంలో ఇది అధిక స్థాయిని అందు కుంది 18వ శతాబ్దంలో యూరప్‌లో వయొలిన్ నేటి ఆధునిక రూపాన్ని పొందింది గొప్ప గొప్ప వయొలిన్ తయారీదారులు రష్యా జర్మనీ, పోలండ్, ఫ్రాన్స్ మరియు కొన్ని ఇతర దేశాలలో ప్రఖ్యాతి పొందారు కానీ మంచి వయొలిన్ తయారీకి ఇటలీ కర్ర, ఇటలీ వాతావరణం, శీతోష్ణస్థితి ప్రసిద్ధి పొందాయి.

నిపుణులు శ్లాఘించే ఇటలీ వయొలిన్‌ల ప్రసిద్ధి, వాటి స్వరమాధుర్యం అక్కడి సూర్య రశ్మి, ప్రశాంత వాతావరణం మరియు గాలి ముఖ్య కారణం అని నిరూపించబడింది ఇక్కడి ఆల్ప్స్ పర్వత ప్రాంతాలలో ఆంటోనియస్ స్ట్రాడివేరియస్ నిర్మించిన వయొలిన్‌ల వంటి వయొలిన్ ఉత్పాదనకు తగిన కర్ర దొరుకుతుంది ప్రపంచం అంతటా ప్రఖ్యాత గాయకులలో ఇవి చాలా ప్రసిద్ధి పొందాయి

●

# మానవుని సర్వోత్తమమైన కానుక ఆశ్చర్య భావం



C. Rajagopalachari

విజ్ఞానం మరియు మతాలకు ఆశ్చర్యం పునాది వ టిది మానవుని సర్వోత్తమమైన కానుక ఆశ్చర్య భావం. దీనిని అనుసరించి జిజ్ఞాసా భావం కలుగు తుంది. విజ్ఞానంతో ప్రయోగాలు జరిపి పరిశీ లించి, పరిశోధించి జవాబులను తెలుసుకోవాలి అటువంటి పరిశోధన, పరిశీలన అవధిని చేరినా ఇంకా ఆశ్చర్య భావం అలాగే ప్రశ్నార్థకంగా ఉండి పోతుంది ఈ ఆశ్చర్య భావం నుంచే విస్మయం పొందుతాం, అదే ఆరాధన.

— రాజాజీ

"కష్టనష్టాలు ఎన్నిటినో తనలో ఇముడ్చుకున్న బల హీనత సోమరితనం."

# సుప్రసిద్ధ సంగీత శాస్త్రజ్ఞులు

## ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి

సుమారు ఆరు దశాబ్దాల పాటు ప్రఖ్యాత కర్నాటక గాయకురాలు, సంగీత చక్రవర్తిని అగు శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి ప్రపంచం అంతటా ఆత్మోత్తేజకరమైన తన మృదు మధుర గానంతో శ్రోతల మనస్సులను రంజింపజేసింది.


M.S. Subbulakshmi

1916 సెప్టెంబరు 16న జన్మించిన సుబ్బులక్ష్మి సామాన్య విద్యను కూడా అభ్యసించలేదు. ఈమె వీణా వాద్య నిపుణి అగు తన తల్లి షణ్ముఖవడివు వద్ద కర్ణాటక సంగీతం నేర్చుకుంది. అప్పటికి ఇంకా 13 సంవత్సరాలే. తల్లితో చేరి ఆమె బహిరంగ సభలో మొట్ట మొదట పాల్గొంది. ఈమె 15వ సంవత్సరం నుంచే సభలలో పాడడం ప్రారంభించింది. 18వ సంవత్సరం వయస్సు దాటకుండానే గొప్ప గాయకురాలుగా ప్రఖ్యాతి పొందింది. ఆనాటి నుండి ప్రగతి మార్గంలో పయనిస్తూ అనేక సుప్రసిద్ధ రాగాలను పాడి శ్రోతలను ఆహ్లాద పరుస్తూంది.

ఈమె 24వ సంవత్సరం వయస్సులో దృఢ నిశ్చయం, దూరదృష్టి గల టి. సదాశివం అనునతనిని వివాహం చేసుకుంది ఈతడు ఈమెను సుప్రసిద్ధ కర్నాటక గాయకురాలుగా తీర్చిదిద్దాడు ఈమె సంగీతాభిమానానికి తగిన ప్రోత్సాహం కలిగించాడు.

ప్రఖ్యాత గాన కళా కోవిదులైన శ్రీ ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్ మరియు శ్రీ సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ తమ మార్గదర్శకత్వంలో ఈమెకు అవకాశం కల్పించి సంగీత కళలో అపూర్వ నిపుణినిగా తయారుచేసారు.

భర్త తీసిన హిందీ ఫీచర్ ఫిల్మ్ 'మీరా'లో ఈమె ముఖ్య పాత్ర ధరించింది పాటలు పాడింది మీరాలో ఈమె పాడిన 'మేరే తో గిరిధర్ గోపాల్ దూసరొ నా కొహె' అనే పాట భారతదేశంలో మిక్కిలి ప్రసిద్ధి చెందింది

సంగీత త్రిమూర్తులలో త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితరు, శ్యామాశాస్త్రి పాటలను, పురందరదాసు, అన్నమాచార్యుల పదాలను, నారాయణ భట్టాద్రి శ్లోకాలను, తుకారాం, తులసీ

### మొత్తం వినియోగిత శక్తి

*18వ శతాబ్దంలో మొత్తం వినియోగింపబడిన శక్తి శతాబ్దానికి 16 మిలియను టన్నుల బొగ్గు (మెట్రిక్ టన్నులు). 19వ శతాబ్దానికి ఇది 32 మెట్రిక్ టన్నులు అయింది. నేడు ఇది 3,200 మెట్రిక్ టన్నులు. ఇది 20వ శతాబ్దానికి ముందు 2,000 సంవత్సరాలలో వినియోగింపబడిన మొత్తం శక్తికి సమానంగా ఉంటుంది*

*— 'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో*

"దైన్యమనునది, నిరాశయనునది పురోగమనమునకు పరమ శత్రువులు."

దాస్, సూరదాస్ అభంగాలను అపూర్వ ఉత్సాహంతో, అభినివేశంతో, అర్థపరిజ్ఞానంతో పాడి శ్రోతలను సమ్మోహపరిచింది

ఈమె లలిత పదాలతో, ఉల్లాసవంతమైన జావళీలతో, మృదుమధురమైన రాగమాలికలతో, ఆత్మోత్తేజకరమైన భజనలతో, హృదయ రంజకమైన తిల్లానాలతో శ్రోతలను ఆశ్చర్య చకితులను చేసింది. సామాన్య స్తోత్రాలు కూడా ఈమె కంఠంలో సంగీత కళతో మారు మ్రోగుతాయి

ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి కంఠం మృదు మధురమై ఉత్తేజకరంగా అలరారుతుంది. ఉత్తర భారతదేశపు హిందూస్థానీ రాగాలను, వివిధ ప్రాంతాల జానపద గీతాలను కూడా కర్నాటక సాంప్రదాయక సంగీతం అంత సరళంగా పాడుతుంది.

ఎమ్.ఎస్ సుబ్బులక్ష్మి 1963లో ఎడిన్ బర్గ్ ఇంటర్నేషనల్ ఫెస్టివల్ ఆఫ్ ఆర్ట్స్‌లో కర్నాటక సంగీతంలో పాల్గొని తరువాత లండన్, ఫ్రాంక్‌ఫర్ట్, జెనీవా మరియు కైరోలలో అనేక సంగీత సభలు, కచేరీలు చేసింది

యునైటెడ్ నేషన్స్ డే రోజు 1966 అక్టోబర్ 23న యునైటెడ్ నేషన్స్ సెక్రటరీ జనరల్ యు థాంట్ ఈమెను యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీ ముందు పాడడానికి ఆహ్వానించడం ఒక అపూర్వమైన అవకాశం ఈమె జీవితంలో ఇది ఒక మరవపురాని ఘట్టము.

న్యూయార్క్‌లో 1977లో గౌరవప్రదమైన కార్నీజ్ హాల్‌లో ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి సంగీత సభను కావించింది. 1982లో లండన్‌లో ఫెస్టివల్ ఆఫ్ ఇండియా ప్రారంభోత్సవం ఈమె సంగీత కచేరీతో ప్రారంభమైంది. మాస్కోలో క్రెమ్లిన్ పాలెస్ ఆఫ్ కాంగ్రెస్‌లో భారత మరియు యుఎస్ఎస్ఆర్ ప్రధాన మంత్రుల ఆధ్వర్యంలో 1987లో సోవియెట్ యూనియన్‌లో జరుపబడిన ఫెస్టివల్ ఆఫ్ ఇండియాకు సంగీత సభ చేసింది

## 8 మిలియను హెక్టేరుల అడవులు సాలీనా కొట్టివేయబడుతున్నాయి



*ప్రపంచం అంతటా మొత్తం 8 మిలియను హెక్టేరుల అడవులు కలపకు, వ్యవసాయానికి కొట్టి వేయబడుతున్నాయి గత 40 సంవత్సరాలలో మొత్తం ఉన్న అడవులలో సగానికి సగం నరికి వేయబడ్డాయి వాటిలో ప్రతీ హెక్టేరుకి సుమారు 250 టన్నుల బొగ్గు ఉంది.*

*అడవులను త్వరగా నరికివేయడానికి చాలా మటుకు చెట్లు కాల్చివేయబడ్డాయి దీని ఫలితంగా ఇప్పటికిప్పుడే దెబ్బతిన్న హరిత గృహ ప్రభావానికి (Green house effect) ఉష్ణం మరింత అధిక మవుతుంది.*

*ప్రతీ సంవత్సరం ప్రపంచంలో అడవులను కొట్టి వేయడం వల్ల 1,000 మిలియను టన్నుల కార్బన్ గాలిలోకి విడుదల అవుతూంది. ఇది మానవుల వల్ల సంభవించే దానిలో ఆరవ వంతు ఇంతే గాకుండా అడవులు కొట్టివేయడం వల్ల అనేకరకాల మొక్కలు, జంతువులు అన్నీ అంతరించిపోతున్నాయి.*

"సామాన్య స్త్రీలకే ప్రేమంటే ఏమిటో తెలుస్తుంది.
అందగత్తెల జీవితం ఆకర్షణల మధ్య గడుస్తుంది."

1954లో భారత అధ్యక్షులు ఈమెకు పద్మ భూషణ్ బిరుదును ఇచ్చి గౌరవించారు. 1956లో సంగీత నాటక్ అకాడమీ అవార్డును గ్రహించింది. అదే సంవత్సరంలో ప్రెసిడెంట్స్ అవార్డు కూడా ఇవ్వబడింది. 1967లో కలకత్తా రవీంద్ర భారతి యూనివర్శిటీ ఈమెకు ఆనరరీ డాక్టర్ ఆఫ్ లిటరేచర్ పట్టా ప్రదానం చేసి గౌరవించింది.

ఎమ్ ఎస్. సుబ్బులక్ష్మి 1968లో మద్రాసు మ్యూజిక్ అకాడమీ కాన్ఫరెన్స్ అధ్యక్షతను వహించిన మొట్టమొదటి మహిళ. 'సంగీత కళానిధి' బిరుదును పొందిన మొదటి మహిళ.

1974లో ఎమ్ ఎస్ సుబ్బులక్ష్మి ప్రజాసేవకై ఫిలిప్పైన్స్ ఏషియన్ నోబెల్ బహుమానంగా పేరుపొందిన రామన్ మెగసేసే అవార్డు అందుకుంది 1975లో భారత అధ్యక్షుడు 'పద్మ విభూషణ్' బిరుదును ఇచ్చి గౌరవించారు.

యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్ సైంటిఫిక్ అండ్ కల్చురల్ ఆర్గనైజేషన్ వారు ప్రతిపాదించిన ఇంటర్నేషనల్ మ్యూజిక్ కౌన్సిల్ 1981లో ఈమెను మెంబర్ ఆఫ్ ఆనర్ ఆఫ్ ది కౌన్సిల్ గౌరవ సభ్యురాలుగా ఎన్నుకున్నారు.

శాంతినికేతన్ విశ్వభారతి యూనివర్శిటీ వారు 1981లో 'దేశికోత్తమ' బిరుదును ఇచ్చి గౌరవించారు 1987లో మద్రాసు యూనివర్శిటీ వారు డాక్టర్ ఆఫ్ లిటరేచర్ ఆనరరీ డిగ్రీని ఇచ్చి గౌరవించారు. భారత ప్రభుత్వం ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మిని 1989 మే నుండి 5 సంవత్సరాలపాటు నేషనల్ రీసెర్చి ప్రొఫెసర్‌గా నియమించారు.

జాతీయ సమైక్యతకు ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మికి అయిదవ ఇందిరా గాంధీ అవార్డు లభించింది. 1990లో త్రివేంద్రం (కేరళ)లో శ్రీ స్వాతి తిరునాళ్ సంగీత సభ ఈమెకు 'గాయక రత్నం' బిరుదును, 1991లో ఒరిస్సా స్టేట్ కౌన్సిల్ ఆఫ్ కల్చర్ వారు 'కోణార్క్ సమ్మాన్ అవార్డును' ఇచ్చి గౌరవించారు.

అమ్మార్య గాయకులలో ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి ఒక గానకళకే గాక ఇతర కళలకు కూడా ఉద్యమాలు సాగించింది అని చెప్పడం నిర్వివాదం. ఈమె వ్యక్తిత్వం, సంగీత శాస్త్రం కూడా భారత దేశపు ఆధ్యాత్మికోన్నతిని ప్రతిబింబిస్తున్నాయి.

## నీ శరీరానికి నీవే యజమానివి



*శరీరం ఆరోగ్యవంతంగా ఉండాలంటే నీవు యజమానిగా ఉండాలి. శరీరం అలవాటుకి బానిస అయిపోయే ప్రాణి కాబట్టి నీవు ఎలా ఉండాలను కుంటే నీ శరీరం అలా అలవాటు చేసుకుంటుంది. నీ శరీరం నీది, నువ్వు కాదు. నీకు మంచిదని తోచే ఆహారం పెట్టు శరీరానికి ఆలోచనాశక్తి లేదు. శరీరానికి కోరికలు ఎన్నో ఉంటాయి అన్నీ తీర్చక్కర లేదు. నీవు నీ శరీరాన్ని క్రమపద్ధతిలో ఉంచితే తప్ప అది ఒకప్పుడు అధికంగా తింటుంది, అధికంగా తాగుతుంది, అధికంగా నిద్రపోతుంది మరొకప్పుడు తక్కువగా తింటుంది, తక్కువగా తాగుతుంది, తక్కువగా నిద్రపోతుంది.*

"మహా యుద్ధానంతరం ఏ దేశానికైనా మిగిలేది మూడు రకాల సేన: అంగవికలుల సేన, దుఃఖితుల సేన, దొంగల సేన."

# ప్రతీ సమస్యకు దాని పరిష్కారం ఉంటుంది

## నార్మన్ విన్సెంట్ పీలీ

వ్యాపారస్థులను కలుసుకోవడం అంటే నాకు ఎంతో సరదా వాళ్ల ఉత్సాహవంతమైన సృజనాత్మక స్వభావం నుంచి ఎంతైనా నేర్చు కోవచ్చు వ్యాపారం కిటుకు తెలిసిన అయిదు మంది చేరి నాకు సమస్యా పరిష్కార విధానం నేర్పారు.



ఫ్రెడ్ హాస్ ఎన్ని సమస్యలైనా స్వంతంగా పరిష్కార విధానం ఆలోచించేవాడు. 30 సంవత్సరాలు పనిచేసిన తరువాత ఒక చిత్త శుద్ధి లేని భాగస్వామి వల్ల ఫ్రెడ్ వ్యాపారం నష్టపడిపోయింది. ఇతడు నన్ను ఒకసారి కలసినప్పుడు చాలా బాధపడిపోతాడేమో అనుకున్నా కానీ అతడు అప్పులు, ఋణాలు కంటే ఆస్తులు అధికంగా ఉన్నట్లు చెప్పాడు.

ఫ్రెడ్ హాస్ దివాలా తీసిన ఒక సంవత్సరం తరువాత మరో వ్యాపారంలోకి దిగాడు. వ్యాపారం బాగా కొనసాగుతూంది. ఇప్పటికీ అతడు చెప్పినది నేను మరచిపోలేను 'అయితే ఎలాగా అని కాదు - ఎలా చేయాలి అని నేను ఆలోచిస్తా' అనేవాడు (I decided I would not be an if thinker, but a how thinker)

ఇది వాస్తవంగా యోచించవలసిన విషయం అయితే ఎలాగా అని ఆలోచించేవాడు నష్టాన్ని గురించి ఆలోచించుకుంటూ - 'నేను గనుక ఇలా చేసి ఉంటే' అని చెప్పుకుపోతాడు. ఇక మీదట ఎలా చేయాలా అని ఆలోచించే వాడు అయిన దానికి చింతించడు ముందు వెంటనే ఉత్తమ పరిష్కారానికి దారి చూస్తాడు ఎందుకంటే అతడికి తెలుసు పరిష్కారం ఉందని. అసలు ప్రశ్న ఎలాగా అని తెలుసు కోడానికి ప్రయత్నిస్తాడు.

జె సి. పెన్నీ అనే మరో వ్యాపారస్థుడు జీవితంలో సమస్యలను ఎదుర్కోడంలో గొప్ప వేదాంతి. ఇతడు 95వ సంవత్సరంలో మరణించినప్పుడు అతడి అంత్యక్రియలకు నేను వెళ్లవలసి వచ్చింది అతడు జీవితంలో దేనికీ భయపడేవాడు కాదు.

ఒకసారి జీవితాంతం ఇంత ఉత్సాహంగా ఉండటానికి కిటుకు ఏమిటి? అని ప్రశ్నిస్తే అతడు 'చూడు నార్మన్, వాస్తవంగా నా సమస్యలకు ఎంతో ఋణపడి ఉన్నాను. ప్రతీ సమస్యను ఎదుర్కొన్నప్పుడు రాబోయే సమస్యలను

### వ్యక్తిగతమైన మార్పు

*మనసులో మార్పు వస్తే దృక్పథం వేరుగా ఉంటుంది. ముందు అప్రియంగాను, వికారంగానూ కనిపించినవి చాలా అందంగా, మనోహరంగా ఉంటాయి. అవి ఒక నూతన పాఠాన్ని భోదిస్తాయి బద్ధ విరోధులు ప్రాణస్నేహితులుగానో, ఉపాధ్యాయులుగానో మారతారు. కాబట్టి వ్యక్తిగతమైన మార్పే మార్పు అప్పుడే అంతా మంచి ఏర్పడుతుంది*

—రాధా బుర్నియర్

"చెమ్మగిల్లే కనులు బ్రతుకులోని కమ్మదనాలను చవి చూపిస్తాయి."

ఎదుర్కోగలిగిన ధైర్యం ఏర్పడింది. నేను నా కష్టాలతోనే పెరిగాను' అన్నాడు.

ఛార్లెస్ ఎఫ్ కెట్టెరింగ్ ఒక ప్రఖ్యాత వైజ్ఞానిక పరిశోధకుడు గొప్ప జ్ఞాని సహజ వేదాంతి ముఖ్యంగా ఆటోమోటివ్ రంగంలో అపూర్వ కల్పనాచతురుడు ఒకరోజున విజ్ఞానాత్మకమైన సంభాషణలో సమస్యలపైన వీరి వేదాంతం తెలుసుకున్నా 'అసలు సమస్యలు లేకుండా నేను ఏమీ చేయలేను' అని అతడు ఉద్ఘాటించి చెప్పాడు. 'అవి నా మెదడును గట్టిపరుస్తాయి' అన్నాడు 'నేను ఎప్పుడూ నా సహచరులను విజయాలను గురించి చెప్పవద్దంటాను. అవి నన్ను నీరస పెట్టేస్తాయి వాళ్ల సమస్యలు, కష్టాలు వింటూంటే ధైర్యం అలవడుతుంది' అని అతడు అంటాడు.

డబ్ల్యు క్లెమింట్ స్టోన్ కంబైన్డ్ ఇన్స్యూరెన్స్ కంపెనీ ఆఫ్ అమెరికా ప్రెసిడెంట్. మరో గొప్ప వ్యక్తి. సమస్యలను ఎదుర్కొనే వ్యక్తి. అతడి చికాగో ఆఫీసుకి ఒకసారి ఇద్దరికి సంబంధించిన ఒక విషయాన్ని గురించి టెలిఫోను చేసాను, మనకో సమస్య బయలు దేరింది అని చెప్పాను

'ఓ అద్భుతం, మంచిదే. ఒక సమస్య రావడం అనేది ఎప్పుడూ మంచిదే. ఎందుకంటే పరిష్కారానికి ఉత్తమ విధానాలు గోచరిస్తూంటాయి' అన్నాడు. అనేక సమస్యలకు పరిశోధనలతో జీవితం గడిపిన స్టోన్ ప్రతీ సమస్యకు దాని పరిష్కార విధానం ఉంటుందనే విశ్వాసం కలవాడు వాస్తవంగా పరిష్కరించగలను అనే విశ్వాసం గల ప్రతీ మనిషికి పరిష్కార విధానం ఉంటుంది

మరో చిరకాల స్నేహితుడు, గొప్ప వివేకవంతుడు రాబ్ రోబాటమ్ మంచి ఆత్మవిశ్వాసం కలవాడు. భగవద్భక్తి కలవాడు ఇతడు ఒకసారి చెప్పాడు 'నీ గురించి నీవు ఎప్పుడూ బాధపడిపోకు '

ఎంత వాస్తవమైన మాట! ఎప్పుడూ దానిని ఎదురుగుండా చూస్తూండు. ఆ మాట అర్థానికి అంటించుకో ఇంట్లో ప్రతీ గోడకు ఆ వాక్యం అతికించు

నీ గురించి నీవు బాధపడిపోకు - అంటే ఏమిటి? అంటే నీవు చేయలేనిదానిని నీకు శక్తి లేదని, నీవు అసమర్థుడవని, సమస్యలు పరిష్కారం చేసుకోలేవని చెప్పుకోవద్దు. ఇక 'చేయలేను' అనే దానిలో 'లేను' తీసి 'గలను' పెట్టుకో. ధైర్యం ఏర్పడుతుంది. నేను చేయగలను భగవంతుని దయ ఉంటుంది జీవిత సమస్యలతో క్రుంగిపోవడం కాదు. వాటిని భరించాలి

ఈ విధంగా మారిపోతే నీవు ఒక క్రొత్త మనిషివి అయిపోతావు 'నేను భగవంతుని సహాయంతో అన్నీ సక్రమంగా చేయగలను' అనే ధైర్యం తెచ్చుకో ●

## ఇంటి సలహాలు

* మీ ఇంట్లో నల్లుల బాధ పోగొట్టుకోవాలంటే వటిక వేడినీటిలో కరిగించి మంచం మీద ముఖ్యంగా నల్లులు ఉండే చోట సందులలోను, అతుకులలోను చల్లండి
* టమాటోలు కాసేపు చన్నీటిలో పెట్టి ఉంచితే వాటిని సులభంగా కోయవచ్చు కాసేపు వేడినీటిలో ఉంచితే పైతొక్క సులభంగా వచ్చేస్తుంది
* పచ్చి మిరపకాయలు ఫ్రిజ్‌లో నిల్వ ఉంచే ముందు తొడిమలు తీసివేయండి
* వడబోసిన టీ ఆకు జిడ్డు పట్టిన గిన్నెలు, బాణలీలు తోమడానికి ఉపయోగపడుతుంది. గులాబీ మొక్కలకు ఇవి బలవర్థకమైన టానిక్‌గా పనిచేస్తుంది

"స్పందించగలచైతన్యం సహృదయతఉన్నప్పుడే ఉండగలుగుతుంది"

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1. వైరస్ (virus) అంటే ఏమిటి?
2. నెపోలియన్ III ఎవరు?
3. తాండవ శివుడు 'నటరాజ' అర్థం ఏమిటి?
4. భారతదేశవు మణిపూర్ (ఈశాన్య దిక్కు) రాజధాని నగరం ఏది?



5. తమిళనాడు గ్రేట్ ఫోర్ట్స్ (గొప్ప కోటలు) ఎక్కడ ఉన్నాయి?
6. ఏ పక్షి ఇతర పక్షి గూళ్లలో తన గ్రుడ్లను పెడుతుంది?
7. పైప్ స్మోకింగ్ ఎవరు కనిపెట్టారు?

## మాటల మహిమ

1. ఎడ్డె. (ఎ) మూర్ఖుడు, (బి) మోటువాడు, (సి) విరసుడు, (డి) ముదుకది.
2. ఏవ: (ఎ) రోత, (బి) జుగుప్స, (సి) హెచ్చరిక, (డి) ఏకాగ్రత.
3. ఒరపాలు: (ఎ) కొరత, (బీ) లోపము, (సి) నీళ్లపాలు, (డి) అరమర.
4. ఈడు: (ఎ) సామ్యము, (బి) అనుగుణము, (సి) వెనుకబడు, (డి) వయస్సు
5. ఉరవడి (ఎ) మిక్కిలి వేగము, (బి) పరాక్రమము, (సి) శౌర్యము, (డి) అనుకూలము
6. ఎసరు (ఎ) వంటకై నీరు మరగబెట్టు, (బి) హాని కలిగించు, (సి) అతిశయించు, (డి) ఒప్పు
7. ఉవ్వెత్తు (ఎ) పూర్తిగా, (బి) అనాయాసంగా, (సి) ఎక్కువగా, (డి) అవలీలగా
8. అదాటుగా (ఎ) అకస్మాత్తుగా, (బి) హఠాత్తుగా, (సి) విచారపడు, (డి) తొందరపాటుగా

## తెలివికి పరీక్ష

1. దేనికి మిక్కిలి లోతు ఉండదు?
2. యూరప్‌లో 'DENEWS' ఏ దేశము?
3. క్రింద సూచించిన వారందరికీ గల ఒకే సమాన లక్షణం ఏమిటి?
   విన్‌స్టన్ చర్చిల్, క్లెమెంట్ అట్లే, హెరాల్డ్ మాక్మిలన్, ఎడ్వర్డ్ హీత్, మార్గరెట్ థాచర్
4. మానవులకు భరించలేని భాద్యతల బరువు, చిక్కులు, విసిగించే విషయాలు ఏమిటి?
5. నిష్ఫలక్రియ లేక అనవసరపు శ్రమను గోదావరితో ఎలా పోలుస్తారు?
6. 'నమోలిలపితబ' పాదము ఎటువంటి పాదము?

(జవాబులకు వ పేజీ చూడండి)

### ప్రపంచంలో మిక్కిలి చిన్న వృక్షం!

ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రంలో గ్రీన్‌లాండ్‌లో డ్వార్ఫ్ విల్లో అనేది ప్రపంచంలో మిక్కిలి చిన్న వృక్షం. ఇవి సామాన్యంగా 50 మి.మీ.ల కంటే చిన్నవిగా ఉంటాయి.

"సంస్కారం అలవడడానికి సాహిత్య పఠనం దోహదం కలిగిస్తుంది."

# ఇంకో అమ్మ

అధ్యాత్మిక రంగంలో ఆరితేరిన మహనీయులు, దివ్యాంశ సంభూతులు, భగవంతునితో నడిచినవారు ఎందరెందరో మన భారత దేశంలో తరతరాలుగా అవతరిస్తూ వస్తున్నారు. అఖిల ప్రపంచాన్ని అనుగ్రహించిన అలాంటి అమ్మ ఒక ఆమె ఆనాడు బాపట్ల దగ్గర



జిల్లెళ్లమూడిలో 1923లో జన్మించింది ఆమె పేరు అనసూయాదేవి. బాల్యం నుంచే అద్భుతమైన మహిమలు, లీలలు ప్రదర్శించిన మహనీయురాలు. ఆనాడు ప్రజల మనస్సులను సరళమైన ఉపదేశాలతో ఆధ్యాత్మిక మార్గం వైపు మళ్లింపడమే ఆమె జీవిత ప్రధాన లక్ష్యం అయింది కష్టంలో ఉన్న అందరినీ ఆదుకోవడమే ఆమె మతం అయింది.

ఇంకో అమ్మ 1953 సెప్టెంబరు 27 న కేరళలో ఒక చిన్న కుగ్రామంలో జన్మించింది. ఈ అమ్మ పేరు సుధామణి. ఈమె చిన్ననాటి నుంచే ఆధ్యాత్మిక రంగంలో ఆరితేరిన శ్రీకృష్ణ భక్తురాలు

ఈమె అయిదవ సంవత్సరం వయస్సు నుంచి శ్రీకృష్ణునిపై దివ్య ప్రేమానురాగాలతో అనేక భక్తి పాటలను వ్రాయడం ప్రారంభించింది శ్రీకృష్ణుని దివ్యప్రేమలో మునిగి పోయింది. ప్రపంచాన్నే మరచి పోతూండేది ఈమె పాటలు చుట్టుపట్ల గ్రామా

## సమాన ధర్మాలు

*ఒకవ్యక్తి ఒక హోటలు లేక బాంక్ లేక స్టోర్ దేనిని నిర్వహిస్తున్నా ఆ వ్యక్తి సమాన ధర్మాలను అనుసరించాలి వీటిలో ముఖ్యమైనది తాను ప్రారంభించిన సాహసికోద్యమం పూర్తిగా ప్రతీకాశాదారుని వ్యవహారంపై ఆధారపడి ఉంటుందని గ్రహించాలి.*

## ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన మొదటి మహిళ




*జపాను క్లైంబరు జున్‌కో టెబీ ఎవరెస్ట్ శిఖరాన్ని (8848 మీటర్లు) అధిరోహించిన మొదటి మహిళ ఈమె 1975 మేలో ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన ఈ శిఖరాన్ని ఎక్కింది.*

**"దుఃఖంలేని జీవితం, సుఖశాంతులు కోరుకోవడంలో తప్పు లేదు. అది తనకు మాత్రమే కావాలని కోరుకోవడంలోనే ఉంది తప్పు."**

లలో ప్రసిద్ధి పొందాయి మృదుమధురమైన సంగీతంతో పాటలు పాడుతుండ ఈమె తొమ్మిదవ సంవత్సరం వయస్సులో తల్లి అనారోగ్య పరిస్థితుల వల్ల పాఠశాల విద్యలను విరమించుకుంది సుధామణి తల్లికి పరిచర్యలు చేస్తూ గృహకృత్యాలు నెరవేరుస్తూండేది తీరిక సమయాలలో పాటలు వ్రాసుకుంటూ శ్రీకృష్ణుని సదా సంకీర్తిస్తూండేది.

సుదామణికి 17 వ సంవత్సరం వచ్చే టప్పటికి నిద్రాహారాలు లేక భగవంతుని సన్నిధికై పరితపించేది. అనేకసార్లు ఒంటరిగా దివ్య సాన్నిధ్యంలో ఆనందిస్తూండేది

ఒకనాడు సుధామణి హృదయంలో 'కష్టంలో ఉన్నవారిని ఆదుకో - అదే అందరి హృదయాలలో ఉన్న నన్ను వాస్తవంగా పూజించడం' అనే దివ్యవాణి వినిపించింది ఆనాటి నుండి మానవసేవకు పూనుకున్న సుధామణి 'అమ్మ' అని పిలువబడుతూంది. ఈ 'అమ్మ' 'అమ్మాచ్చి' మాతా అమృతానంద మాయి దివ్యాంశ సంభూతురాలు అవతరించిన ప్రేమమూర్తి ఈమె.

వివిధరకాల మానవులు ఈమె దర్శనార్థం వస్తారు భక్తితో ఈమె దర్శనం చేసుకుని ఆమె దివ్య ఆదేశాలను, సందేశాలను తెలుసు కుంటారు తమ జీవిత సమస్యలకు పరిష్కారం పొందుతారు. ఆరోగ్యాన్ని చేకూర్చుకుంటారు ఈమె మాటలు, సంభాషణ అతి సామాన్యంగా ఉంటాయి దివ్యానుభూతులతో కూడి ఉంటాయి ఈమె ఆశ్రమం కేరళలో వల్లిక్కావు దగ్గర ప్రకృతి సుందరమైన ద్వీపంలో కుళితురాలో ఉంది ఇది ఒక ప్రధాన ఆధ్యాత్మిక కేంద్రంగా, ఒక ముఖ్య యాత్రాస్థలంగా మారిపోయింది.

## అనేకానికి ఆద్యుడు



*యునైటెడ్ కింగ్‌డమ్ రెండవ ఎలిజబెత్ మహారాణి కుమారుడు ప్రిన్స్ ఛార్లెస్ దేశ చరిత్రలో పాఠశాలలో విద్య నేర్చిన మొట్టమొదటి రాజవంశస్థుడు మరియు యూనివర్సిటీ డిగ్రీని పొందిన, తన స్వంత ఓడ మీద కమాండర్‌గా పనిచేసిన, క్రీడా జట్టుకి కాప్టన్‌గా ఉన్న, హెలి కాప్టర్లు, సూపర్ సోనిక్ జెట్ విమానాలను నడిపిన, ఫ్రాగ్‌మాన్ మరియు కమాండర్‌గా శిక్షణను పొందిన మొదటి రాజవంశీయుడు*

*1545లో ట్యూడర్ పరిపాలకుల కాలంలో మునిగి పోయిన యుద్ధనౌక 'మేరీ రోస్'ను పరిశీలించ డానికి ఇతడు ఇంగ్లీష్ ఛానెల్‌లోకి దూకాడు.*

## ఆస్త్మాకి క్రొత్త ఔషధం

మెగ్నీషియం సల్ఫేటు ఇంట్రావీనస్ ఇంజక్షనులు ఇచ్చినప్పుడు జపానులో ఆస్త్మా లక్షణాలు కొద్దిగా కనిపించిన 10 మందికి, తీవ్రంగా పరిణమించిన 3 రోగులకు పూర్తిగా స్వస్థత కలిగింది మెగ్నీషియం శరీరంలో లేకపోవడం వల్ల కొన్నిరకాల ఆస్త్మా వస్తుందని జపాను పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు

—'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

"మంచి కించిత్తు ఎక్కడున్నా స్వీకరించాలి."

# డా॥ మార్టిన్ లూథర్ కింగ్

నోబెల్ శాంతి బహుమానాన్ని పొందిన వారిలో మిక్కిలి చిన్నవాడు డా.మార్టిన్ లూథర్ కింగ్ నల్ల అమెరికనులు అనేకమంది డా. మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్‌ని దేవ దూతగా పరిగణిస్తారు ఇతడు నల్లజాతిని వేరుపరచే సెగ్రిగేషన్ విధానాన్ని నివారించ డానికి వారికి ఒక గొప్ప శక్తివంతమైన ఆయు ధాన్ని అందజేసాడు. అదే అహింసాత్మక ప్రతి ఘటన



MARTIN LUTHER KING

కింగ్ 1968 ఏప్రిల్ 4న హత్యకావింపబడ్డాడు. కానీ నేటికీ అతడు కన్నకల అట్లాంటా జార్జియా ప్రత్యేక కేంద్రంలో చైతన్యవంతమై సజీవంగా ఉంది. అహింసాత్మక సాంఘిక పరివర్తనకు ది మార్టిన్ లూథర్ కింగ్ సెంటర్ బ్రహ్మాండమైన సంకీర్ణ భవనం కింగ్ శ్మశాన భూమిలో నిర్మింప బడింది. ఇచ్చట ప్రతిబింబించే మడుగులో పాలరాతి గోరీపైన అఖండ జ్యోతి వెలుగు తూంటుంది

1968లో ఈ కేంద్రం స్థాపింపబడింది. కింగ్ పూర్తి చేయలేని అహింసా సిద్ధాంతాన్ని బోధన ద్వారా వివరించి సమర్థించుటయే దీని ముఖ్య ఆశయం

ఇచ్చట ఒక లైబ్రరీలో అపురూపమైన 87 సంపుటాల మహాత్మాగాంధీ సంపూర్ణ వాఙ్మయం (Collected works of Mahatma Gandhi) ఉంది ఇలా మరియొక అహింసా ధర్మవాదికి సంబంధించిన వాఙ్మయం కూడా చోటు చేసు కోవడం సముచితం.

ఇచ్చట లైబ్రరీ, ఆర్కైవ్‌లలో కింగ్‌ను గురించి మరియు అమెరికన్ సివిల్ రైట్స్ మూవ్‌మెంట్‌కు సంబంధించిన వివిధ విషయాలు సంగ్రహించబడ్డాయి వీటితో పాటు కింగ్ స్వంతంగా రచించిన కాగితాలు కూడా ఎన్నో ఉన్నాయి.

వీటిని సంరక్షించడానికి 14 డిగ్రీల సెల్షియస్ ఉష్ణోగ్రత దగ్గర ఒక చిన్నగది తాళం వేయ బడి ఉంటుంది. ఇందులో కింగ్స్ స్వంత డాక్యుమెంట్లు 500 దాకా భద్రపరచబడ్డాయి.

నేడు కింగ్ శయనించి ఉన్న ప్రదేశమే ఒక పెద్ద ఓక్ వృక్షం క్రింద చిన్నతనంలో కింగ్ ఆడుకున్న ప్రదేశం అని చెబుతారు.

1990 అక్టోబర్‌లో కింగ్ సెంటర్‌లో యునైటెడ్ స్టేట్స్ మహాత్మాగాంధీ జయంతి ఉత్సవం జరిపింది. అట్లాంటాలో 1996 ఒలింపిక్ క్రీడల నిర్వహణలో కూడా పాల్గొనడానికి సన్నాహాలు జరుగుతున్నాయి

కింగ్ 1964 నోబెల్ శాంతి బహుమానాన్ని పొందాడు.

— 'యు.ఎస్ ఐ ఎస్'సౌజన్యంతో

---

"చరిత్ర నేర్పే పాఠాలనుండి గుణపాఠాలు నేర్చుకోలేనంత వరకు జీవితంలో ప్రగతి శూన్యం."

# గాంధీజీ స్వాతంత్ర్యదిన సందేశం

నిర్మల్ కుమార్ బోస్

అధికార వినిమయ సమయంలో గాంధీజీ నోఖాలీలో ఉండాలని తీర్మానించు కున్నారు వీరు కలకత్తా చేరేటప్పటికి ఒక బిబిసి ప్రతినిధి భారతదేశం స్వాతంత్ర్యం పొందే సందర్భంలో బారతదేశం సందేశాన్ని లండన్ నుంచి ప్రపంచం అంతటా ప్రసారం చేయడానికి రికార్డు చేసుకుందామని వచ్చాడు



GANDHIJI

నేను గాంధీజీ దగ్గరకు వెళ్ళి 'లండన్ బిబిసి నుంచి ఒకరు వచ్చారు అతడు మీ సందేశం రికార్డు చేసుకుంటాడట' అన్నాను దానికి గాంధీ 'అంతా శుష్కించిపోయింది నేను ఇవ్వగల సందేశం ఏమీలేదు. అతడు నా దగ్గరకు ఎందుకు రావడం జవహర్‌లాల్ నెహ్రూ వద్దకు వెళ్ళమను' అన్నారు నేను ఆ వార్తను బిబిసి ప్రతినిధికి చెప్పాను 'భారతదేశం తరపున ఎవరైనా సందేశాన్ని ఇవ్వగలిగితే గాంధీ మహాత్ముడు ఒక్కడే ఇవ్వగల సమర్థుడు ఇతరులు ఎవ్వరూ కాదు దయతో వారికి తెలియజెప్పండి వారి సందేశాన్ని వివిధ భాషలలోకి అనువదించి ప్రపంచం అంతటా బ్రాడ్ కాస్ట్ చేస్తాం' అన్నాడు

నేను తిరిగి అడగడానికి వెళ్లాను ఒక చిన్న కాగితం అడిగారు దానిమీద 'నాకు ఇంగ్లీషు తెలుసుననే విషయం మరచి పొమ్మని చెప్పు' అని వ్రాసారు

తరువాత 1947 ఆగస్టు 14న బెంగాల్ ముఖ్యమంత్రి డా॥ ప్రఫుల్ల చంద్రఘోష్ తన పరివారంతో వచ్చి మరునాడు ఏవిధంగా ఉత్సవం జరిపించాలి అని గాంధీని అడిగారు గాంధీజీ నేల మీద పరచిన దుప్పట్లు మీద ఒరిగి పడుకున్నారు ఆయన లేచి 'మన చుట్టూ జనం అంతా ఆకలితో మలమల మాడి చచ్చిపోతున్నారు అంతా మండిపోతూంది ఈ విధ్వంసక సమయంలో ఉత్సవం జరుపుతారా వెళ్ళండి ఉపవాసం ఉండండి' అన్నారు

ఇదే స్వాతంత్ర్య భారతానికి గాంధీ సందేశం

నాకింకా జ్ఞాపకం ఉంది ఇద్దరు విద్యార్థులు అదే రోజున ఆయనను చూడడానికి వచ్చి 'స్వాతంత్ర్య దినం ముందు మీ సందేశం ఏమిటని' అడిగారు దానికి 'ఇదొక విచార కరమైన ఘట్టం' అని గాంధీ చెప్పారు.

—'గాంధీ ఇన్ ఇండియన్ పాలిటిక్స్' సౌజన్యంతో

## గంటకు 39,897 కి.మీ.ల చొప్పున ప్రయాణం చేసారు

అపోలో X అంతరిక్ష నౌక 1969లో వాతావరణం లోకి ప్రవేశించినప్పుడు అమెరికా అంతరిక్ష యోధులు గంటకు 39,897 కి.మీ.ల చొప్పున ప్రయాణం చేసారు.

"చెడును విస్మరించి, మంచిని సంస్మరించి సంరక్షించుకోడం యోగ్యతకు లక్షణం."

# మధుర-తెలుగు వాఙ్మయము

సీతా రవిచంద్రన్

తెలుగు జాతికి చెప్పుకోదగ్గ చరిత్ర, సాహిత్యం, సంస్కృతి ఎంతో ఉంది ఆంధ్ర సాహిత్య చరిత్రలో 16వ శతాబ్దం ప్రాముఖ్యత వహించింది శ్రీకృష్ణదేవరాయలు పాలించిన ఈ యుగాన్ని రాయలయుగం అన్నారు ఈ యుగంలో విషయ వైవిధ్యంతో అనేక ప్రబంధాలు భావబంధురములై సర్వతోముఖ సాహిత్యాభివృద్ధి కలిగించాయి అందుకే తెలుగు సాహిత్య చరిత్రలో దీనిని స్వర్ణ యుగం అన్నారు స్వయంగా కవి అయిన రాయలు ఆముక్త మాల్యదను రచించాడు అనేక కవులను ఆదరించి పోషించాడు. ఎనిమిది మంది ప్రముఖ కవులు రాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలుగా ప్రఖ్యాతి పొందారు తెలుగు భాషలో ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియ, ప్రబంధ ప్రక్రియ ప్రభవించింది ఈ విజయ నగర రాజ్య పతనానంతరం ప్రబంధయుగం అంతరించింది

దక్షిణదేశ రాజ్యాలు స్వతంత్రాలు అయ్యాయి. ఆ యా స్వతంత్ర రాజ్యాలను పాలించిన తెలుగు ప్రభువులు తెలుగు భాషను పోషించారు, తెలుగు కవులను ఆదరించారు తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు, దక్షిణాంధ్ర రాజ్యాలలో మధుర రెండవది.

ఈ మధుర రాజ్యపాలన విశ్వనాథ నాయకునితో ప్రారంభమైంది. తరువాత మధుర రెండు శతాబ్దాల పాటు రాజకీయ సాంస్కృతిక రంగాలలో ప్రాముఖ్యతను వహించింది. విశ్వనాథ నాయకుని కాలంలో సాహిత్య పోషణ అంతగా జరుగకపోయినా మొట్టమొదటి వచన కావ్యం తెలుగు వాడుక బాషలో "రాయవాచకము" వెలువడింది విశ్వనాథ నాయకుని ఆస్థానంలో స్థానాపతి (రచయిత పేరు తెలియదు) దీనిని రచించాడు. ఇందులో శ్రీకృష్ణ దేవరాయల చరిత్ర, అతడి యుద్ధాలు, విజయాలు విపులంగా వర్ణించబడ్డాయి.

మధురను మొత్తం 12 మంది రాజులు పాలించారు మధురనేలిన ముద్దు కృష్ణప్ప నాయకుని కుమారుడైన తిరుమల నాయకునితో తెలుగు సాహిత్య పోషణ ప్రారంభమైంది. తిరుమల నాయకుడు క్షేత్రయ్యను, తిరుకామ కవిని సత్కరించాడు. ఇతడి తరువాత ఇతడి కుమారుడు

## ఏమిటి ఇది?



| | |
|---|---|
| ఆర్థ్రైటిస్ | - కీళ్ళవాపు |
| ఓటిటిస్ | - చెవివాపు |
| రినిటిస్ | - మ్యూకస్ వాపు |
| సిస్టిటిస్ | - మూత్రకోశం వాపు |
| మెనింగైటిస్ | - మెదడు వాపు |
| డెర్మటైటిస్ | - చర్మం వాపు |
| కంజక్టివైటిస్ | - కళ్ళు లేక కంటి రెప్పల వాపు |
| థ్రాంబో ఫ్లెబైటిస్ | - రక్తనాళాల వాపు |
| కోలిటిస్ | - కోలాన్ లేక పెద్ద ప్రేగుల వాపు |
| మైలిటిస్ | - వెన్నెముక లేక ఎముకల వాపు |

"వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధులు ప్రపంచంలో వివిధ దేశాలను ఎంత సన్నిహితం చేసినా మానవ మనసులు మాత్రం విడివిడిగా చెదిరిపోయాయి, సాన్నిహిత్యం కాలేకపోయాయి."

ముద్దు వీరప్ప, ఈతని కుమారుడు చొక్కనాథుడు తెలుగు వాఙ్మయాన్ని పోషించారు. చొక్కనాథునికి అతడి సవతి తమ్ముడు అళగిరి తోడ్పడుచుండెను ఈ ప్రభువులే గాక వారి మంత్రులు కూడా తెలుగు సాహిత్యాన్ని పోషించారు

మధుర సంస్థానంలో లింగనమఖి కామేశ్వర కవి, సముఖం వేంకటకృష్ణప్ప నాయకుడు, శేషం వేంకటపతి, కుందుర్తి వేంకటాచల కవి, వెలగపూడి కృష్ణయ్య, బద్దెపూడి ఎఱ్ఱభూపతి మొదలైన కవులు అనేక కావ్యాలు రచించారు తెలుగు సాహిత్యాన్ని పోషించారు

చొక్కనాథుడు, ముద్దు అళగిరి ప్రభువుల కాలంలో లింగనమఖి కామేశ్వర కవి సత్యభామా స్వాంతనము - నాలుగు ఆశ్వాసముల శృంగార ప్రబంధం, నరకాసుర వధ-ద్వారకా నగరవాసులలో శృంగారవీర రసాలు పోషింప బడిన గ్రంథము ముద్దళగిరి ప్రభువునకు అంకితంగా రచించాడు ఈ కవి రచించిన ధేనుకా మహాత్మ్యము - తెలుగులో రెండవ వచన కావ్యము - ఇది చొక్కనాథునకు అంకితం ఇవ్వబడింది ఈ కామేశ్వరునికి తిరుకామ కవి అనే మరో పేరు కూడా ఉంది.

1706-32 సంవత్సరాలలో మధురను ఏలిన విజయరంగ చొక్కనాథుడు గద్య వాఙ్మయాన్ని పోషించాడు. స్వయంగా శ్రీరంగ మహాత్మ్యము, మాఘ మహాత్మ్యము చక్కని వచనశైలిలో రచించాడు. ఇతడు అనేక కవులను పోషించాడు ఈతని కాలంలో అనేక శృంగార కావ్యాలు, గేయకావ్యాలు, వచన కావ్యాలు, యక్షగానాలు వెలువడ్డాయి ఈతని కాలంలో సముఖం వెంకట కృష్ణప్ప నాయకుడు గొప్ప కవి తిక్కనవలె దండనాథుడు కూడా. ఒక ప్రక్క మధుర రాజుల విజయాలకు సహాయ పడుతూ మరియొక ప్రక్క ఆస్థానకవిగా కవితా గోష్ఠులలో పాల్గొంటూండేవాడు ఈతడు అహల్యా సంక్రందనము, రాధికా స్వాంతనము అనే రెండు పద్య కావ్యాలు, జైమినీ భారతము, సారంగ ధర చరిత్ర అనే గద్యకావ్యాలు రచించాడు

చొక్కనాదుని కాలంలో పేరుపొందిన కవులలో ఇంకొకడు శేషము వేంకట కవి శశాంక విజయం అనే గ్రందాన్ని రచించాడు మంచి సరసుడు, సంగీత సాహితీ చతురుడు శశాంక విజయం తారాచంద్రుల ప్రణయగాధ

కుందుర్తి వేంకటాచలకవి మిత్రవింధా పరిణయము, కార్తీక మహాత్మ్యము, భాగవత, రామాయణాదులను రచించాడు వెలగపూడి వేంకట కృష్ణకవి వేదాంతసార సంగ్రహం, మాలతీ మాదవము, బానుమద్విజయము, బద్దెనపూడి ఎఱ్ఱనృపాలుడు యువజన హృద యానందము రచించారు

మధురలో ఆస్థాన కవులేగాక శ్యామరాయకవి, దేవకి వేంకటసుబ్బకవి, శ్రీపతి రామభద్రకవి మున్నగు ఇతర కవులు అనేకమంది వివిధ వచన కావ్యాలు గ్రాంధిక భాషలో రచించారు హాలాస్య మహాత్మ్యము (వచనము), విద్యావతీ దండకము మొదలగునవి రచించబడ్డాయి.

మొత్తం మీద మధురలో అనేక శృంగార కావ్యాలు వెలువడ్డాయి వచన రచన ఎక్కువగా పోషింపబడింది శృంగార ప్రబంధాలకు మధుర పెట్టినది పేరు ●

**వరకట్నపు దుర్మరణాలు**

వరకట్న నిషేధ చట్టంలో రెండు సవరణలు తీసుకువచ్చినా భారతదేశంలో వరకట్నపు దుర్మరణాలు తగ్గలేదు. అధికమౌతూనే ఉన్నాయి. 1987లో ఉన్న 1,912 మరణాలు 1989లో 4,006 అయ్యాయి.

— 'హ్యూమన్ రైట్స్ వరల్డ్‌వైడ్' సౌజన్యంతో

"తనకేమీ తెలియదని గ్రహింపలేనివాడు మూర్ఖులలో మూర్ఖుడు."

# మానవుని జీవితంలో విడుదల

విడుదల దేనినుండి విడుదల? కష్టాల నుండి. ఇదే మోక్షం, ముక్తి, కైవల్యం అని కూడా చెప్పబడుతూంది జన్మపరంపర నుండి విడుదల పొందుట సచేతనుడైన జీవి అక్షయమైన సుఖాన్ని అనుభవిస్తూండే విశిష్ట స్థానం ముక్తి త్రివర్గ కామి అయిన మానవుని నాలుగవ పురుషార్థం మోక్షం అర్థకామములెంత భోగ్యములైనను వాటినే కేవలం సేవించడం



మనవారి మతం కాదు అర్థకామాలనే కాదు కేవలం ధర్మాన్ని కూడా సేవించరాదనే వారు తలంచారు. అర్థకామాలు లేని ధర్మం సేవించుట పంట భూములను విడిచి అరణ్యములను దున్నుట వంటిది అన్నారు అదేవిధంగా ధర్మ సమన్వితములుగాని అర్థకామాదులు కూడా దూష్యములే కాబట్టి అర్థకామాదులను ధర్మ సాధనలుగా సేవించి ఆ త్రివర్గము చేతనే మోక్షానికి మనవారు మెట్లు కట్టారు జ్ఞానావధి మోక్షం మోక్షం కోరేవాడు మోక్షి

ఈ మోక్షం రెండు విధాలుగా ఉంది. ఒకటి జీవన్ముక్తి, రెండవది విదేహముక్తి పరమార్థంలో వీటి ఫలితం ఒకటే రెంటికీ భేదం లేదు. దేహేంద్రియాది సకల సాధనాలతో కూడి ఉండి తాను సాక్షాత్తు ఆత్మ స్వరూపుడని తెలుసుకుని పరమాత్మతో సదాసర్వావస్థలలో సాక్షాత్సంబంధం కలవాడై సహజ ధ్యానయోగంతో తనకు పరమాత్మకు ఏకత్వాన్ని భావించేవారు జీవన్ముక్తులు వీరికి దేహేంద్రియాదులు ప్రారబ్ధాధీనములై ఆయాపనులు చేస్తూనే ఉంటాయి ఇటువంటి జీవన్ముక్తుని దర్శన స్పర్శన రూపాలు ఎవరికైనా కలిగితే వారందరూ శ్రేయస్సును పొందుతూంటారు.

ఇక బాహ్యంగా దేహేంద్రియాలు లేనివాడై ముక్తాత్మయై స్వేచ్ఛగా సంచరిస్తూ లోకానికి శ్రేయస్సును కలిగిస్తూ తన ఇచ్ఛతో ఎప్పుడైనా ఏ శరీరంలోనైనా ఆవేశించడానికి స్వాతంత్ర్యం కలవాడై పరమాత్మతో నిత్యరూపమైన ఐక్యతను కలిగి ఉండేవాడు విదేహముక్తుడు

జీవన్ముక్తులైన వారికే మోక్షం సిద్ధిస్తుందని, నాద స్వరూపం తెలుసుకుని పరమాత్మను కీర్తించడం ముక్తికి మార్గం అని సంగీత త్రిమూర్తులలో ఒకడైన రామభక్తుడు త్యాగ రాజు బోధించాడు ప్రస్థానత్రయంలో ముఖ్యమైన భగవద్గీతలో ముక్తిని గురించి యుద్ధభూమిలో రథం మీద ధర్మోపన్యాసం చేస్తూ మోక్షం అంటే ఏమిటి? మోక్షం సాధించడం ఎలా? అనే విషయాలు పార్థసారథి విపులంగా వివరించాడు

మోక్షసిద్ధికి ఆత్మజ్ఞానం కారణం శీతోష్ణాలకు కలత చెందనివారు, సుఖ దుఃఖాలలో సమాన జ్ఞానం కలవారు మోక్షప్రాప్తికి యోగ్యులు. అంటే సుఖదుఃఖాది ద్వంద్వాలను ఎవరు సమభావంతో చూస్తారో, ఎవరిని అవి బాధించవో అటువంటి ప్రశాంతాత్ములు మోక్షానికి అర్హులు ఆత్మ ఇంద్రియాలకు అగోచరం. మనస్సుకు అందనిది. మార్పులు పొందనిది.

---

"నిరుత్సాహం అకాల మరణం వంటిది. పరాజయం పొందకుండానే పరాజయాన్ని ఒప్పుకోవడం వంటిది." — రాబర్ట్ సప్రిజా

ఇది ఇట్టిదని గ్రహించాలి. బుద్ధి యోగాన్ని సాధించిన ప్రాజ్ఞులు కర్మఫలాన్ని త్యజించి, జన్మ బంధాన్ని వీడి సర్వోపద్రవాతీతమైన స్థానాన్ని పొందుతారు. కామాసక్తుడుకి ఎప్పటికీ శాంతి కలుగదు. సంపూర్ణంగా నిండీ కూడా మేరమీరక నిశ్చలమై గంభీరంగా ఉండే సముద్రంలోకి ఎన్ని నదులు ప్రవేశించినా అది ఏ విధంగా ఏ మార్పు చెందకుండా గంభీరంగా ఉంటుందో అదేవిధంగా వివిధ వాంఛలు, కోరికలు బుద్ధిలో లయం చేసుకుని 'నేను' 'నాది' అనే భావమే లేక జీవించేవారు శాంతిని పొందుతున్నారు అహంకార మమకారాలను విడిచి సంచరించేవారే పరమ శాంతిని పొందుతున్నారు ఇదే బ్రాహ్మీ స్థితి ఈ స్థితిని పొందిన వారికి మోహం కలుగదు మరణ సమయంలోనైనా దీనిని పొందినవారు మోక్షాన్ని పొందుతారు.

అనురాగం, భయం, కోపం లేకుండా తననే భావిస్తూ తననే ఆశ్రయించి జ్ఞానాగ్ని చేత పవిత్రతను పొంది అనేకమంది తనలో ఐక్యమొందారనీ, శ్రద్ధ, ఏకాగ్రత, భక్తిగల జితేంద్రియులు మాత్రమే జ్ఞానాన్ని పొందుతారని, జ్ఞానం కలిగిన వెంటనే పరమ శాంతి, మోక్షం లభిస్తుందని, సమబుద్ధియందు సుస్థిరులైనవారు కర్మ ఫలితాన్ని వదలి జ్ఞాన మార్గంలో సిద్ధిని పొందుతారని, శాంతిని పొందుతారనీ, సమబుద్ధి రహితులు వాంఛావశులై కర్మఫలాసక్తిచే బద్ధులవుతున్నారని శ్రీకృష్ణుడు వివరిస్తాడు.

బాహ్య విషయాలలో మునగనివారు ఆత్మానుభూతి చేత కలిగే సుఖాన్ని పొందుతారు. ఇటువంటివారు బ్రహ్మధ్యాన నిమగ్నమైన చిత్తంతో అక్షయమైన ఆనందాన్ని అనుభవిస్తారు. ఆత్మయందే సుఖిస్తూ, ఆత్మయందే క్రీడిస్తూ, ఆత్మయందే జ్ఞానజ్యోతిని చూచేవారు బ్రహ్మ స్వరూపులై సశరీర మోక్షాన్ని పొందుతారు. తమ లోపాలన్నిటినీ పోగొట్టుకుని మంచి చేసేవారు సశరీర మోక్షాన్ని పొందుతారు. కామక్రోధ విముక్తులై, వశీకృత చిత్తులై ఆత్మజ్ఞానం పొంది మోక్షానందాన్ని అనుభవిస్తున్నారు వశీకృత చిత్తులై మనస్సును ఎల్లప్పుడూ స్థిరంగా ఉంచుకునేవారు తనయందు చేరి మోక్షంలో నివసిస్తూ శాంతిని పొందుతారు అత్యల్పంగాను, అత్యధికంగాను భుజించే వారికి, అత్యధికంగా, అత్యల్పంగా నిద్రించేవారికి యోగసిద్ధి కలుగదు అని అంటాడు పరమాత్ముడు

## ఆనందం



తమ పనిలో తాము సంతోషంగా సుఖం పొందాలంటే ఈ మూడు ముఖ్యం వాళ్లు దానికి అర్హులై ఉండాలి. దానిని వాళ్లు అతిగా చేయకూడదు వాళ్లకి దానిలో విజయభావం స్ఫురించాలి ప్రపంచ ఏమనుకున్నా, ఏం చెప్పినా సందిగ్ధంగా ఉండకూడదు. కృత నిశ్చయంగా ఉండాలి పని సరిగ్గా జరిగింది, వాస్తవికతతో నిర్వహించబడింది అని మీకు తృప్తి ఉండాలి కాబట్టి ఒకరు సౌఖ్యంగా ఉండాలంటే తన పని తాను సరిగ్గా నిర్వర్తించడమే గాక తన పనిని స్వయంగా విమర్శించుకునేటట్టుగా ఉండాలి

— జాన్ రస్కిన్

"అసత్యాన్ని సత్యమని తలచి మొండికెత్తే సత్యాగ్రహి దురాగ్రహి."

మరణకాలంలో తననే స్మరిస్తూ శరీరాన్ని విడిచేవారు మోక్షాన్ని పొందుతారు. మనస్సు, బుద్ధి తన మీదే నిలిపితే నిశ్చయంగా తనను పొందుతారనీ, భక్తితో, నిశ్చల చిత్తంతో ఎవరు మరణకాలంలో కూడా తననే స్మరిస్తూ ఉంటారో వారే పరమ పురుషుని చేరతారు అని అన్నారు. వేదవేత్తలగు పండితులు ఈ విశ్వపురుషునే అక్షరతత్త్వం అన్నారు ఏకాక్షరమైన 'ఓం'కారాన్ని స్మరిస్తూ ఈ దేహాన్ని విడిచేవారు పరమ గమ్యాన్ని చేరతారు అని, అనన్య చిత్తంతో తననే ప్రతీదినం నిరంతరం స్మరిస్తూ సదా సుస్థితులైన యోగులకు తను సుసాధ్యం అని, పరిపూర్ణత్వం పొంది తనను చేరిన మహాత్ములకు దుఃఖ నిలయము, అశాశ్వతము అయిన పునర్జన్మ ఉండదని, అన్ని లోకాలు పునర్జన్మతో కూడినవే కానీ తనను పొందినవారికి పునర్జన్మ ఉండదని అవ్యక్తము, అక్షరము అను దానిని పరమగతి అంటారని, యజ్ఞానుష్ఠానం, తపస్సు, దానం అనువాటివల్ల అన్నిటిని అతిక్రమించి పరమ స్థానాన్ని పొందగలుగుతారు అని సర్వమును ఈశ్వరునికి అర్పించి జీవన్ముక్తులై మరణించిన తరువాత తన దగ్గరకు వస్తారు అని తిరిగి వివరిస్తాడు శ్రీకృష్ణుడు

"ఎంతటి ఘోర పాపాత్ముడైనా నాయందే భక్తితో నన్ను భజిస్తే అతి శీఘ్రంగా ధర్మచిత్తుడై శాశ్వత శాంతిని పొందుతాడు. పాపజన్ములైన వారందరూ నా శరణు పొంది మోక్షాన్ని పొందుతారు. భక్తి చేత మాత్రమే నన్నీ రూపమున తెలుసుకొనుటకు, యదార్థముగా చూచుటకు, నాలో ప్రవేశించుటకు వీలగును నాకొరకే కర్మముల ఆచరించుచూ, నన్నే గమ్యంగా ఉంచుకుని, నాకు భక్తుడై సంగ వర్జితుడై ఎవరితోను వైరములేనివాడు నన్ను పొందుతాడు భక్తియోగంతో ఎవరు నన్ను ధ్యానించుచూ ఉపాసిస్తున్నారో వారిని అతి శీఘ్రంగా సంసార సాగరం నుంచి ఉద్ధరిస్తున్నాను కనుక నాయందే మనస్సును నిలిపి నాయందే బుద్ధిని ఏకాగ్రం చేసుకోండి అప్పుడు నిస్సందేహంగా మీరు నాయందే నివసిస్తారు" అని గీతాకారుడు వివరించాడు.

అన్ని కర్మలను చేయించేది ప్రకృతి అని ఆత్మ నిష్క్రియ అని తెలుసుకున్నవాడు యధార్థ దర్శి. అనాది అగుటవల్ల, నిర్గుణమగుట వల్ల అక్షయ పరమాత్మ శరీరంలో ఉన్నా నిష్క్రియవల్ల గానీ, క్రియవల్లగానీ బాధ ఉండదు ఈ జ్ఞానాన్ని పొంది నా స్వరూపమును పొందినవారు సృష్టి కాలంలో జన్మించరు ప్రళయకాలంలో ఆపదను పొందరు త్రిగుణాలను అతిక్రమిస్తూ పుట్టుక, చావు, ముదిమి అనే వాటినుండి విముక్తులై అమృత తత్త్వమును పొందుతారు. ఎవరు ఏకాంత భక్తితో సర్వభూతములందు ఉన్న నన్ను ఉపాసిస్తున్నారో వారు గుణాతీతులై బ్రహ్మభావాన్ని పొందడానికి సమర్థులు అవుతున్నారు అని గీతలో శ్రీకృష్ణ పరమాత్ముడు విశదీకరిస్తాడు.

తిరిగి శ్రీకృష్ణుడు "అహంకారం, అవివేకం లేనివారు, ఆసక్తి దోషం లేనివారు, పరమార్థ జ్ఞాన నిష్ఠులు - సుఖ దుఃఖ ద్వంద్వాలకు అతీతులైన జ్ఞానులు పరమపదాన్ని పొందుతున్నారు. దేనిని సూర్య చంద్రాగ్నులు ప్రకాశింపచేయవో, ఎక్కడికి వెడితే వారు తిరిగి రారో అదే నా పరమపదం భక్తిచేత నేనెవ్వరో, ఏమిటో యదార్థంగా తెలుసుకోగలరు. ఎప్పుడూ తన పనులు తాను చేస్తూ నా శరణు పొందడంవల్ల నాకృపవల్ల నిత్యము అవ్యయం అయిన స్థానాన్ని పొందుతారు. పరిపూర్ణ హృదయంతో ఆశ్రయించు నా కృప చేత పరమశాంతి, శాశ్వత స్థానం ప్రాప్తిస్తాయి" అని వివరించాడు

—వాధూల

"విశ్వాసం సడలినట్టు కనబడినప్పుడు జీవితం భారమనిపిస్తుంది"



Hon'ble Shri Justice Harilal J. Kania
14-8-1947 to 6-11-1951



Hon'ble
Shri Justice M Patanjali Sastri
7-11-1951 to 3-1-1954



Hon'ble Shri Justice
Mehar Chand Mahajan
4-1-1954 to 22-12-1954



Hon'ble Shri Justice B.K. Mukherjea
23-12-1954 to 31-1-1956



Hon'ble Shri Justice S R. Das
1-2-1956 to 30-9-1959



Hon'ble Shri Justice
Bhuvaneshwar Prasad Sinha
1-10-1959 to 31-1-1964



Hon'ble
Shri Justice P B Gajendragadkar
1-2-1964 to 15-3-1966



Hon'ble Shri Justice A.K. Sarkar
16-3-1966 to 29-6-1966



Hon'ble Shri Justice K. Subba Rao
30-6-1966 to 11-4-1967



Hon'ble Shri Justice K.N. Wanchoo
12-4-1967 to 24-2-1968



Shri Justice M. Hidayatullah
25-2-1968 to 16-12-1970

# భారతదేశపు ప్రధాన న్యాయమూర్తులు స్వాతంత్ర్యం నాటి నుంచి



Hon'ble Shri Justice S.M. Sikri
22 1-1971 to 25-4-1973



Hon'ble Shri Justice J.C. Shah
17-12-1970 to 21-1-1971



Hon'ble Shri Justice A.N. Ray
26-4-1973 to 28-1-1977



Hon'ble Shri Justice M.H. Beg
29-1-1977 to 21-2-1978



Hon'ble
Shri Justice Y.V. Chandrachud
22-2-1978 to 11-7-1985



Hon'ble Shri Justice P.N. Bhagwati
12-7-1985 to 20-12-1986



Hon'ble Shri Justice R.S. Pathak
21-12-1986 to 18-6-1989



Hon'ble
Shri Justice E.S. Venkataramiah
19-6-1989 to 17-12-1989



Hon'ble
Shri Justice Sabyasachi Mukharji
18-12-1989 to 25-9-1990

భారతదేశపు
ప్రధాన
న్యాయమూర్తులు
స్వాతంత్ర్యం
నాటి నుంచి



Hon'ble
Shri Justice Ranganath Misra
From 25-9-1990 to 24-11-1991



Hon'ble Shri Justice K N Singh
From 25-11-1991 to 12-12-1991



Hon'ble Shri Justice M.H. Kania
From 13-12-1991 to

# వీరిని గురించి తెలుసుకోండి

**డా శివరామ్ కరంత్:** ప్రఖ్యాత రచయిత. జానపద కళాప్రతిపాదకులు వీరు 50కి పైగా కన్నడ నవలలు, 40కి పైగా నాటకాలు రచించారు వీరు రచించిన 'మూకజ్జియ కనసుగళు' అనే నవలకు జ్ఞానపీఠ్ బహుమానం ఇవ్వబడింది

విష్ణు ప్రభాకర్: ప్రఖ్యాత హిందీ రచయిత - ఇతడు ఆరు నవలలు, 20 కథా సంగ్రహాణలు, 12 నాటకాలు, 13 జీవిత చరిత్రలు, అనేక ఇతర యాత్రాగ్రంథాలు రచించాడు 1988లో ఇతడి 'సత్తా కే ఆర్‌పార్' అనే నాటకానికి 'మూర్తిదేవి పురస్కార్' లభించింది.

దువ్వూరి సుబ్బమ్మ (1880-1964): స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో ఆంధ్రదేశంలోని ప్రముఖ నాయకురాండ్రలో ఈమె ఒకరు సహాయ నిరాకరణోద్యమంలో శిక్షణను పొందిన భారతీయ మహిళలలో రెండవది. గొప్ప వక్త, గొప్ప సంఘ సేవకురాలు అనేకసార్లు ఈమె జైలులో నిర్బంధింపబడింది 16 సంవత్సరాలపాటు ఏఐసిసి సభ్యురాలుగా ఉండెను. 1923లో కాకినాడ కాంగ్రెస్ ఈమెకు దేశ బాంధవి బిరుదును ఇచ్చి గౌరవించారు. 1964లో ఈమె మరణించింది.

సి.వి.వి. (1868-1922) : కంచుపాటి వెంకట్రావు వెంకాసామిరావు. దక్షిణాత్య ఆంధ్రుడు, కుంభకోణం జన్మస్థానం. ఒక ప్రత్యేక యోగ మార్గమును ప్రవర్తింపజేసిన ప్రముఖులు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, తమిళ భాషలలో గొప్ప పండితులు. వీరు చిన్ననాటి నుండే జీవితానికి పరిష్కార మార్గమును అన్వేషించుటకు మొదలుపెట్టారు. మాస్టర్ C.V.V.గా ప్రఖ్యాతి చెందారు. వీరు విశిష్ట రాజయోగ మార్గం - భృకుటి రహిత తారక రాజయోగము అనేదానిని ఆవిష్కరించిరి. కుంభకోణంలో యోగా స్కూల్ ఫ్రెండ్స్ సొసైటీని నెలకొల్పారు. మానవునికి అమరత్వమును కలుగజేయుట, ఈ యోగ మార్గాన్ని అవలంబించి శారీరక వ్యాధులను పోగొట్టుకొనుట, ఇతరులకు వ్యాధులను పోగొట్టి అమరత్వమును పొందుట దీని ముఖ్య లక్ష్యములు. వేటూరి ప్రభాకర శాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, ఎక్కిరాల కృష్ణమాచార్యులు మొదలైన పలువురు ప్రముఖులు దీనికి ప్రచారమును కల్పించారు. తిరుపతి, విశాఖపట్టణం, విజయవాడ, పిడుగురాళ్ల, కుంభకోణం మొదలైన ప్రదేశాలలో ఈ యోగా కేంద్రాలు నడువబడుతున్నాయి.

## మెట్రిక్యులేట్లు!



ప్రతీ సంవత్సరం వేలకొద్దీ బాల బాలికలు మెట్రిక్యులేషన్ పరీక్షలు పాసవుతున్నారు 'మెట్రిక్యులేషన్' అనే పదం 'మెట్రిక్యులా' అంటే సంఘం సభ్యుల 'రోల్' లేక 'రిజిస్టర్' అని అర్థం. ప్రతీ సంవత్సరం ఎంతమంది మెట్రిక్యులేషన్ పాసైన విద్యార్థులు, విద్యార్థినులు సుఖ సౌఖ్యాలు వదలుకుని వాస్తవంగా జీవిత ఆదర్శాలకై ఏర్పడిన కొత్త సంఘంలో సభ్యులుగా చేరుతున్నారు?

— టి.ఎల్ వాస్వాని

"అనివార్యమగుదానికి విలపించటం నిరర్థకం."

# ఆదర్శ ఉపాధ్యాయులు

దర్భా శాంతి విశ్వనాథ్

ఒక్క భారతదేశంలోనే కాదు, ప్రపంచంలో పలుచోట్ల ఉపాధ్యాయులలో 'శీల సంక్షోభం' ఏర్పడుతూంది. అధ్యాపకవృత్తి ముఖ్య లక్ష్యం నశించిపోయింది పెక్కుమంది అధ్యాపకులకు క్రమశిక్షణ, సక్రమ వేళ పాటింపు మొదలైనవి నిఘంటువులలో పదాలు మాత్రంగానే నిలిచి పోయాయి. విద్యార్థుల సంక్షేమాన్ని కోరి వాటిని పాటించే ఉపాధ్యాయులు కొంతమంది లేకపోలేదు.



ఆదర్శ ఉపాధ్యాయులు ఎవరు? ఉత్తమ అధ్యాపకుల లక్షణాలు ఏమిటి? ఉపాధ్యాయులు అలవరచుకోవలసిన సద్గుణాలు ఏమిటి?

కొందరు ఆదర్శవంతులైన అధ్యాపకులు సహజ సిద్ధంగా జన్మిస్తారు. మరి కొందరు అభ్యాసంవల్ల ఆదర్శవంతులు అవుతారు యువకులకు సదాచారాలను, సక్రమ పద్ధతిలో అధ్యాపక శిక్షణను ఇచ్చి వారిని భారతదేశపు భావి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దగల సహజ సిద్ధమైన ఉపాధ్యాయులుగా తయారవుతున్నారు

ఆదర్శవంతుడైన ఉపాధ్యాయుడే విద్యార్థులకు సక్రమ మార్గ దర్శకుడు, తత్త్వ బోధకుడు మరియు ఉత్తమ స్నేహితుడు ఇటువంటి ఉపాధ్యాయులు తమ విద్యార్థులలో విజ్ఞాన వివేకాల సంతు

## ప్రపంచంలో లేనివాళ్ళు ఎవరూ లేరు




లోకంలో సాధారణంగా ఉన్నవాళ్ళు, లేనివాళ్ళు అని రెండు రకాలు ఉన్నారని అందరూ అనుకుంటారు కానీ ఒక రోజున నాకు భగవంతుని దయవల్ల ప్రతీ మానవుడు 'ఉన్నవాడే', లేనివాడు కాదనే అభిప్రాయం కలిగింది కొందరికి భూమి ఉంటుంది కొందరికి భాగ్యం ఉంటుంది. కొందరికి శ్రమించి పని చేయడానికి సామర్థ్యత ఉంటుంది కొందరికి విజ్ఞానం, కొందరికి ప్రేమ ఔదార్యాలు, ప్రతీ వారికి ఏదో ఒకటి ఉంటుంది కానీ వారు ఉన్నదానిని ఇంట్లో నాలుగు గోడల మధ్య విని యోగించుకోడానికి భద్రంగా దాచుకుంటారు ప్రేమ లేకపోవడం అనేది లేదు కానీ అది ఇంట్లోనే ఇంటి వరకు మాత్రమే బయట దానికి పోటీ వస్తుంది కానీ ఈ ప్రేమ అనేది ఇంట్లోనే ఉంటే ప్రవృద్ధి పొందదు —వినోబా భావే

"ఒడుదుడుకులు, కలహాలు లేని జీవితం రసహీనము, జీవితపు ఒడుదుడుకులను సహించటంలోనే వివేకం ఉంది."

లితాభివృద్ధిని ప్రోత్సహిస్తారు. వారి బుద్ధికి తగిన శిక్షణను ఇచ్చుటయేగాక వారి హృదయాలలో సౌకుమార్యతను, సరళ సౌందర్యాన్ని అభివృద్ధి పరుస్తాడు

ఒక ఆదర్శ ఉపాధ్యాయుడుగా విజయం సాధించాలంటే మంచి దీక్ష [illegible] నైపుణ్యం చాతుర్యం, హాస్యధోరణి, బహుముఖ ప్రజ్ఞ, ప్రసన్నత, పరిశీలనాభావం, మర్యాద, పట్టుదల, ఆత్మవిశ్వాసం, దానితోపాటు కరుణామయ స్వభావం ఉండాలి.

పలుచోట్ల ఉపాధ్యాయులకు తగిన గౌరవ మర్యాదలు దొరకడం లేదు. వారిని హీనాతిహీనంగా చూస్తారు మన సమాజంలో ఇది ఒక కుదరని దీర్ఘరోగంగా పరిణమించింది. మన విద్యార్థులకు మనం ఇచ్చే విద్య, శిక్షణ కూడా స్త్రీలైనా, పురుషులైనా మనం ఎన్నుకునే ఉపాధ్యాయుల మీదే ఆధారపడి ఉంటుంది.

మంచి సంభాషణా చతురుడు, ఉత్తమ కథకుడు అయిన ఉపాధ్యాయుడు విద్యార్థులకు గౌరవ ప్రదంగా ఉంటాడు. ఇటువంటి వారు పాఠాలను చెప్పేటప్పుడు మధ్య మధ్య కట్టుకథలు, నీతి కథలు, సరసోక్తులు వాడుతూంటారు.

ఏ ఉపాధ్యాయుడూ కూడా తన విజ్ఞానాన్ని వికసించుకోకుండా విద్యార్థుల ఆదరాభిమానాలను పొందలేరు విద్యార్థులలో జిజ్ఞాసను ఉత్సాహ పరచడం ఒక కళ. ఒక పాఠశాల యొక్క ఖ్యాతి ముఖ్యంగా విద్యార్థులను వ్యక్తిగతంగా, సామాజికంగా, విజ్ఞానదాయకంగా తీర్చిదిద్దగల ఉపాధ్యాయులపై ఆధారపడి ఉంటుంది.

విద్యార్థులు అడిగే దానిని నేర్పించడం ఉత్తమ ఉపాధ్యాయుల ఉత్తమ లక్షణం కాదు. తాను నేర్పించేది విద్యార్థులు అభిలషించేటట్లుగా ఉండాలి!

# గోమాత



రెండువేల సంవత్సరాల నుండి గోమాత మానవుని సహభోగిగా మానవునితో బాటు కష్ట సుఖాలను అనుభవిస్తూ తాను పొందిన సేవలకు అభిమానంతో మానవుని అభివృద్ధికి తోడ్పడుతూ జీవిస్తూంది మానవులు దాని పవిత్రతను గ్రహించి ఆరాధిస్తున్నారు

గోవు మానవుని శ్రేయోభిలాషి. గాలి వానలు, వరదలు, తుఫానులు, ఎండలు, కరువులు ఎన్నెన్నో ప్రకృతి వైపరీత్యాలు సంభవించవచ్చు వంటలు సర్వనాశనమై పోవచ్చు. మన ఆశలు నిరాశలు కావచ్చు. కానీ ఆవు పుష్టికరమైన ఆహార పదార్థాలను మనకిచ్చి పోషిస్తూంది.

ఈ మహోపకారానికి, దాని సొగసు, సౌందర్యానికి మనం ఆవుని అభినందించి ప్రేమిస్తున్నాము. దాని పై భక్తి విశ్వాసాలు ఏనాటికానాడు ఇతోధికంగా అభివృద్ధి చెందుతున్నాయి ఏళ్ళు గతించిన కొద్దీ వయస్సుతో మనం క్రుంగిపోతూన్నా గోమాత స్నేహ సౌభాగ్యం ఏనాటికీ తగ్గిపోవడం లేదు. మన ఋణం తీరుస్తుంది, మన కుటుంబాన్ని సంరక్షిస్తుంది.

ఇ జి.బెన్నెట్— 'ట్రిబ్యూట్ టు ది కౌ' సౌజన్యంతో

"ఆలయ సంరక్షకులు నిజమైన భక్తులు
కానంతవరకు పూజామందిరాలకు విలువలేదు."

# అటుకుల కథ

వడ్లు నానబోసి వేయించి రోట్లో దంపితే అటుకులు తయారవుతాయి. ఈ అటుకులనే అడుకులు అని కూడా అంటారు. వడ్లు నానబెట్టకుండా దంపితే బియ్యం వస్తాయి. బియ్యం నానబెట్టి ఆరిన తరువాత వేయిస్తే బొరుగులు అంటే మరమరాలు వస్తాయి వడ్లు వేయిస్తే పేలాలు వస్తాయి బియ్యం కంటే అటుకులు తేలికగా ఉంటాయి. చాలా రుచిగా ఉంటాయి. సులభంగా జీర్ణం అవుతాయి. ఈ అటుకులతో రుచి రుచిగా, రకరకాల ఫలహారాలు త్వరత్వరగా చేసుకోవచ్చు. వృధా(శమ ఉండదు కాలం కలసి వస్తుంది - ఈ అటుకులను ఇప్పుడిప్పుడు మెషీన్ మీద కూడా తయారు చేస్తున్నారు. ఇవి చాలా పలచగా రేకులులాగా ఉంటాయి. దంపి తయారు చేసేవి కొద్దిగా లావుగా ఉంటాయి. ఎక్కువ రుచిగా ఉంటాయి

అటుకుల మిక్చర్. ఒక గ్లాసెడు దంపి శు(భం చేసిన అటుకులు ఒక్కసారి వేయిస్తే అవి పొంగి గరగరలాడుతూంటాయి. దీనికి ఒక అర గ్లాసు వేయించిన శనగపప్పు, అరగ్లాసు వేయించిన వేరు శనగపప్పు కలపండి. కొద్దిగా ఎండు కొబ్బరి కోరు కలపండి. తరువాత కొద్దిగా నెయ్యి వేడి చేసి అరచెంచాడు, ఆవాలు, కొద్దిగా మినపప్పు, తుంపిన ఒక ఎండు మిరపకాయ ముక్కలు వేసి పోపు వేగిన తరువాత పై మిక్చరు ఇందులో వేసి, కొద్దిగా ఉప్పు వేసి బాగా కలిపి దింపండి. కావలసిన వారు ఒక చెంచా చక్కెర కూడా పైన వేసి కలపవచ్చు ఈ మిక్చరు చాలా రుచిగా ఉంటుంది. ఆరోగ్యకరంగా ఉంటుంది.

పోపు పెట్టిన అటుకులు· ఒక గ్లాసెడు దంపిన అటుకులు, బాగా కడిగి నీరు వడగట్టి అటుకులును ఒక గిన్నెలో పెట్టండి. అవి నాని కొద్దిగా మెత్తగా ఉంటాయి ఒక బాణలీలో నెయ్యి లేక నూనె రెండు చెంచాలు వేసి కొద్దిగా ఆవాలు, జీలకర్ర, మినపప్పు ఒకటి రెండు మిరపకాయ ముక్కలు, రెండు పచ్చి మిరపకాయలు, కరివేపాకు పోపు వేయించాలి వేగిన తరువాత కొద్దిగా కొబ్బరి కోరు వేసి కడిగి ఉంచిన అటుకులు అందులో వేసి కొద్దిగా ఉప్పు వేసి బాగా కలిపి దింపండి. ఇవే పోపు అటుకులు

పులిహోర అటుకులు, పెరుగు అటుకులు, అటుకుల పరమాన్నం, అటుకులతో ఇడ్లీలు, లైమ్ అటుకులు, రకరకాలు తయారు చేసుకోవచ్చు అటుకులు అంటే సామాన్యం కాదు. సాక్షాత్తు శ్రీకృష్ణుడు మెచ్చి అభిమానంతో కొనరు కొనరుగా తిన్న అటుకులు. వీటిని సంస్కృతంలో పృథకులు అంటారు ఈ పృథక వృత్తాంతమే అటుకుల కథ.

అసలు అందరూ మంచివాళ్ళు ఉండరు. అందరూ చెడ్డవాళ్ళు ఉండరు. లోకంలో కొంతమంది మంచివాళ్లు, కొంతమంది చెడ్డ వాళ్లు ఉండడం సహజం. అయినా సాధారణంగా ఎప్పుడూ చెడ్డవాళ్ళే లాభాలు పొందుతూంటారు, సుఖాలు అనుభవిస్తూంటారు లోకంలో సంపద, సౌభాగ్యం వారిదే. ఇక మంచివాళ్లు అనే వాళ్లు ఎప్పుడూ అష్ట కష్టాలు పడుతూంటారు. వారికి జీవితంలో సుఖం కనిపించదు. చెడ్డ వాళ్లకి ఎంత సుఖం ఉన్నా, ఎంత సంపద ఉన్నా జీవితంలో సంతృప్తి అనేదే ఉండదు ఇతోధిక సౌభాగ్యాల కోసం ఊరికే పరుగులు పెడుతూంటారు. మంచివాళ్లు ఎన్ని కష్టాలైనా ఓర్పుగా విశ్వాసంతో భరిస్తూ ముందుకు

"చేయాలనుకున్న పనికి ఆకాంక్ష ఉంటే
తగిన మార్గం గోచరిస్తూనే ఉంటుంది."

సాగిపోతూంటారు. ఇదే విధి విచిత్రం ఇక అలా కథలోకి దిగుదాం

పూర్వం ఒకప్పుడు ఒక సంసారి ఉండేవాడు అతడి పేరు సుదాముడు సుదాముని భార్య లలిత ఈ కుటుంబం గర్భదరిద్రం అనుభ విస్తూంది పిల్లలు ఒక్కటి, ఇద్దరు కాదు, ఏడుగురు బిడ్డలు - సుదాముడు ఎప్పటికప్పుడు లభించినదాంతో తృప్తిపడుతూ అను కూలవతి అయిన భార్యతో జీవితం నెట్టుకు వస్తున్నాడు వచ్చే ఆదాయం సరిపోయేది కాదు. రోజుల తరబడి కుటుంబం పస్తు ఉండవలసి వస్తూండేది ఎన్ని కష్టాలు వచ్చినా ఇవన్నీ పరిపూర్ణ జీవితం సాధించేందుకు సోపాన మార్గాలు అని అను కుంటూ ఆత్మబలంతో ఎదుర్కొంటూండే వాడు సుదాముడు

ఒకరోజు బిడ్డల ఆకలి భాద చూడలేక భార్య లలిత సుదాముడికి ఒక ఉపాయం చెవిలో చెప్పింది శ్రీకృష్ణుడు, సుదాముడు చిన్ననాటి బాల్య మిత్రులు ఒకేచోట చదువుకున్నారు అనిగ్రహించి శ్రీకృష్ణుని వద్దకు వెళ్లి ఆయన సహాయం పొందమని భార్య సుదామునికి సలహా చెప్పింది

ఎంత ఆప్తమిత్రుడైనా ఇంకొకరిని చేయిచాచి అడగడం అంటే ఎంతో కష్టం అనిపిస్తుంది. నామోషి అంతకంటే అసలు డబ్బు అన్ని అనర్థాలకు మూలం. మనిషిని సుగుణాల నుండి దూరం చేస్తుంది అని తలచుకుంటూ ఉన్నాడు డబ్బు కోసం తంటాలు పడి యాచిస్తే చిరకాల స్నేహం పోతుందేమో అని ఉన్నా భార్యా బిడ్డలను పోషించడానికి చివరకు ధైర్యం తెచ్చుకుని శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

చిరకాల స్నేహితులను గానీ, పెద్దవారిని గానీ, గర్భవతులు, చిన్న పిల్లలను గానీ చూడడానికి వెళ్ళినప్పుడు వట్టి చేతులతో వెళ్ళకూడదు శ్రీకృష్ణునికి ఏదైనా తీసుకు వెడదామని అనుకుంటే సుదాముడి దగ్గర ఏమీలేదు సంగతి తెలిసిన భార్య ఒక డబ్బాలో అట్టడుగున ఉన్న గుప్పెడు అటుకులు ఇచ్చి పంపింది అవి తీసుకుని ఎదురు చెప్పలేక సుదాముడు బయలుదేరాడు పైన వేసుకున్న చిరిగిన కండువా ఒక చెంగున ఆ అటుకులు మూట కట్టుకుని శ్రీకృష్ణుని ఇంటికి బయలుదేరాడు. బంగారు గోపురాలు, ద్వారాలతో శ్రీకృష్ణుని గొప్ప భవనం సామాన్యమా! ధగధగా ప్రకాశించిపోతూంది.

శ్రీకృష్ణుడు లోపల నుంచే తన మిత్రుని

## అందరిలో ఒకే ఆత్మ




వ్యక్తిలోను మరియు విశ్వాత్మలోను ఒకే నూలు పోగు ఉంటుంది రెండుగా విడదీయలేనివి. ఒక వెంట్రుకను లాగితే శరీరానికంతా బాధ కలుగు తుంది. భక్తులు ఇంకొకరికి కలిగిన అపకారాన్ని చూచి భరించలేరు ఇది వారికి ఒక విధమైన బాధగా ఉంటుంది అందరిలో ఉండే ఆత్మ ఒకటే అని వారు విశ్వసిస్తారు

— తుకారాం

"పై మెరుగులను గాక లోపలి సౌందర్యాన్ని చూడగలవాడే నిజమైన కళాకారుడు."

చూసాడు. శ్రీకృష్ణునికి ఎప్పుడూ తొందరే. ఎప్పుడూ ఆతరే. భక్తులు అంటే అంత ప్రేమ వెనుక చెరువులో మొసలి గజేంద్రుని పట్టి ఈడుస్తుంటే 'కృష్ణా, నీవే దిక్కు రక్షించు' అంటే చక్రంలేదు, శంకం లేదు, పైన ఉత్తరీయం లేదు, లేచి వెంటనే పరుగెత్తాడు. సుదాముని చూసీ చూడడం తోటే పరుగెత్తుకుంటూ వెళ్ళి కౌగలించుకున్నాడు భక్తులంటే శ్రీకృష్ణునికి అంత ప్రేమ, అంత అభిమానం. సుదాముని తన గదిలోకి తీసుకువెళ్ళాడు. రుక్మిణీ దేవి ఆ పేద బ్రాహ్మణుణ్ణి చూసి విసుక్కుంటోంది. అందరికీ ఆశ్చర్యంగా ఉంది. శ్రీకృష్ణుడు సుదాముని పాదాలు పన్నీటితో కడిగి తలమీద ఆ నీళ్ళు జల్లుకున్నాడు. సుష్టుగా పంచభక్ష్య భోజనాలతో భోజనం చేసారు. సుదామునికి తెచ్చిన అటుకుల సంగతి జ్ఞాపకం వచ్చింది ఇవ్వడానికి సిగ్గుపడుతూండగా దాన్ని గ్రహించి శ్రీకృష్ణుడు 'ఓమిత్రమా! నాకు ఏం తీసుకు వచ్చావు' అన్నాడు. సుదాముడు జవాబు చెప్పడానికి తటపటాయిస్తున్నాడు శ్రీకృష్ణుడు మిత్రుని ఉత్తరీయం చెంగుముడి విప్పి ఆ అటుకులు చేతిలో పోసుకున్నాడు శ్రీకృష్ణునికి తెలుసు ఆ అటుకుల రుచి, ఆ అటుకుల వైశిష్ట్యం ఇన్ని అటుకులు నోట్లో వేసుకున్నాడు. రుక్మిణికి పట్టరాని కోపం, రుస రుసలాడిపోతూంది. శ్రీకృష్ణుడు ఇంకా కొంచెం తినబోతూంటే చెయ్యిపట్టుకుని నివారించింది. కొంతసేపు శ్రీకృష్ణుడు, సుదాముడు చిన్ననాటి ముచ్చటలు తలచుకుని సంతోషంగా కాలం గడిపిన తరువాత శ్రీకృష్ణుని సెలవు తీసుకుని సుదాముడు ఇంటికి బయలుదేరాడు అసలు భార్య చెప్పినది అడగడం మరచిపోయాడు అయితేనేమి! శ్రీకృష్ణునికి అన్నీ ముందే తెలుసు. చేయవలసినది అంతా చేసేసాడు

సుదాముడు ఇంటికి చేరాడో లేదో పూర్వం తన పాతకొంప అక్కడ లేదు. ఒక దివ్య భవనంలో భార్యా పిల్లలు సకల సంపదలతో తులతూగుతున్నారు సుదాముడు ఆశ్చర్య పోయాడు శ్రీకృష్ణునిది ఎంత దయ అనుకున్నాడు భగవంతుని మహిమ అనంతం, అతని దివ్యప్రేమకు అవధులు ఉండవు లౌకిక భాగ్యాలను ఎంత తృణీకరించినా వాటిని ప్రసాదించాడు భగవంతుని తలచుకుని సుదాముడు నిరాడంబర జీవితం గడిపాడు సుదామునికి సకల సౌభాగ్యాలు తెచ్చి పెట్టింది అటుకులే 'శ్రీకృష్ణుడు మెచ్చి అభిమానంతో కొసరి కొసరి తిన్నవి అటుకులే' అందరికీ అనువుగా అందుబాటులో ఉండేవి అనుకోకుండా ఇంటికి అతిథులు, అభ్యాగతులు వస్తే అవస్థ పడిపోకుండా రుచిరుచిగా ఫలహారం తయారు చేయగల అటుకులు పవిత్రమైన అటుకులు!

●

## ఈ రోజు చేయవలసిన పనిని వాయిదా వేయకు

*ఈ రోజు చేయవలసిన దానిని రేపటిదాకా ఎప్పుడూ వాయిదా వేయకు నీ అంతట నీవు చేయగలిగిన దానికి ఇంకొకరిని క్లేశ పెట్టకు. చేతిలో లేకుండా ముందు డబ్బు ఖర్చు పెట్టకు నీకు అవసరం కాని దానిని చౌక అని ఎప్పుడూ కొనకు ఆకలిదప్పుల కంటే హెూదాలు అధికవ్యయం మనసారా నిర్వర్తించినది ఏదీ చికాకు కలిగించదు అనుకోని అసంభవాల వల్ల ఎంత నష్టం? ఎంత బాధ కలుగుతుంది! ఎప్పుడూ జరిగే వాటిని నిశ్చింతగా గ్రహించు. కోపం రేగిపోయినప్పుడు మాట్లాడడానికి ముందు 1 నుంచి 10 దాకా ఒక్కసారి లెక్క పెట్టు చాలా ఎక్కువ కోపం వస్తే 100 దాకా లెక్క పెట్టు.*

—అలెగ్జాండర్ పోప్

"మానవుడు కోపోద్రిక్తుడైనప్పుడు సదసద్వివేకం నశిస్తుంది."

— థామస్ ఫుల్లర్

# లియోనార్డో డా విన్సీ

ప్రపంచ ప్రఖ్యాత పురుషులలో లియోనార్డో డా విన్సీ ఒకడు ఇతడు ఇటలీలో ఫ్లారెన్స్‌కు సమీపంగా 90 కిమీల దూరంలో ఉన్న విన్సీలో 1452 లో జన్మించాడు 1519లో మరణించుటకు పూర్వం ఇతడు ఒక గొప్ప చిత్రకారుడుగా,




విగ్రహారాదులు చెక్కే శిల్పిగా, స్థపతిగా, సంగీత నిపుణుడుగా, కల్పనా చతురుడుగా, ఇంజనీరుగా, శరీర శాస్త్రజ్ఞుడుగా, వృక్ష శాస్త్రజ్ఞుడుగా, ఖగోళ శాస్త్రజ్ఞుడుగా, రసాయన శాస్త్రజ్ఞుడుగా, భూగర్భ శాస్త్రజ్ఞుడుగా పరిగణింపబడ్డాడు

జామిత్రీలో లియోనార్డో కావించిన ఆవిష్కరణలు ఎవరికీ అర్థంగాక విస్మరింపబడ్డాయి. కానీ కొన్ని శతాబ్దాల తరువాత ఇతర గణిత శాస్త్రజ్ఞులు వాటిని తామే తెలుసుకున్నట్లు చెప్పుకున్నారు

లియోనార్డో త్రాడును పేనడానికి ఒక రోప్ మెషీన్‌ను కనిపెట్టాడు రాళ్ళగనిలో రాళ్లను కోయడానికి రంపాన్ని కనిపెట్టాడు. ఆవిరిని ఉపయోగించి పడవలను నడిపించవచ్చని తెలుసుకున్నాడు ఫిరంగులకు ఇనుప కమ్ములను తయారుచేసే విధానాన్ని కనిపెట్టాడు. అతి ఖచ్చితంగా ఒక హెలికాప్టర్‌ను గీసాడు ఇతడు వృక్షములను అతి జాగ్రత్తగా పరిశీలించాడు ఇతడు చిత్రించిన మానవ శరీరాలు సహజ శరీర నిర్మాణాలకు ఖచ్చితంగా ఉన్నాయి. అనేక ఇంజనులకు, సారంగాలకు, కాలువలకు రూపకల్పనలు చేసాడు

'ఎడోరేషన్ ఆఫ్ ది మాగి', 'లాస్ట్ సప్పర్ ఫ్రెస్కో', 'మోనా లిసా', 'వర్జిన్ ఆఫ్ ది రాక్స్' ఇతడి ముఖ్య చిత్రాలు మిలాన్ చర్చి గోడ మీద ఇతడి 'లాస్ట్ సప్పర్' పెయింటింగ్ సుందరాతి సుందరమైనది లియోనార్డో చిత్రించిన సుప్రసిద్ధ చిత్రాలు ఒక్కటీ ఇప్పుడు లేవు అయినా అనేకమంది వాటిని దర్శించడానికి మిలాన్‌కి వెడతారు!

ఫ్లారెన్స్‌లో ఒక అధికారి భార్య లిసా డి జియెకొండా చిత్తరువు ఫ్రాన్స్ ముఖ్య పట్టణమైన పారిస్‌లో లోవ్రె (Louvre) ఆర్ట్ గాలరీలో తగిలించబడింది ఇదే ఈనాటి 'ది మోనా లిసా'. చిత్తరువులో ఆమె చిరునవ్వుతో ఉంటుంది. ప్రత్యేకంగా ఈ చిత్రం గీసేటప్పుడు ఆమె నవ్వుతూ ఉండడానికి సంగీత వాద్యం ఏర్పాటు చేసాడు ఇతడు చివరి రోజులలో ఫ్రాన్స్‌ను పాలించిన ఫ్రాన్సిస్ I కొలువులో ఉండేవాడు.

## కుటుంబ నియంత్రణ విధానం

*భారతదేశంలో 15 మొదలు 30 సంవత్సరాల మధ్య ఎక్కువగా పిల్లలను కనే మొత్తం 720 మిలియనుమంది జనాభాలో 140 మిలియను మందే కుటుంబ నియంత్రణ విధానాలు పాటిస్తున్నారు జననాలరేటు తగ్గించడానికి ఈవయోవర్గానికి చెందిన కనీసం 500 మిలియను మందైనా సంతాన నిరోధక శస్త్రచికిత్స చేయించుకోవలసి ఉంటుంది*

"అనాలోచనగా నేర్చుకోవడం శ్రమకుచేటు. నేర్చుకోకుండా ఆలోచించడం అపాయం."

# కథక్

కథక్ ఉత్తర భారతదేశంలోని శాస్త్రీయ నృత్య విధానం. ఇది భారతదేశపు మణిపురి, ఒడిస్సీ, కూచిపూడి, భరతనాట్యం, కథాకళి మొదలైన భారత శాస్త్రీయ నృత్యకళలలో ఇటీవలి కాలంనాటిది ఉత్తర భారతదేశంలో కథక్, అస్సాంలో మణిపురి, ఒరిస్సాలో ఒడిస్సీ, ఆంధ్రప్రదేశ్‌లో కూచిపూడి, తమిళనాడులో భరతనాట్యం, కేరళలో కథాకళి ప్రసిద్ధి పొందాయి.


Kathak

కథక్ నృత్యం లక్నో సాంప్రదాయమని, జయపూర్ సాంప్రదాయమని, బనారసు సాంప్రదాయమని మూడు విధాలుగా ఉంది ఈ కథక్ నృత్యం మీద శాస్త్రం కంటే సాంప్రదాయకత అధిక ప్రభావం కలిగి ఉంటుంది ఒక విషయాన్ని కథగా వివరిస్తూ చేసే నృత్యమే కథక్ కథలు చెప్పేవాడు కథకుడు. దీని నుంచే కథక్ శబ్దం పుట్టింది సంచార నర్తకులు ఒక బృందంగా ఏర్పడి పురాణ గాథలను నృత్య సంగీతాల ద్వారా ప్రజలలో ప్రచారం చేస్తారు వీరు కథకు అనుగుణంగా నృత్య భంగిమలను ప్రదర్శిస్తూ కథకు ఒక సౌందర్యాన్ని ఆపాదించి ప్రేక్షకులను ఆనంద పరుస్తారు

మొగలాయిలు భారతదేశాన్ని పాలించి (16వ శతాబ్దం) నప్పటి నుంచి కథక్ రాజదర్బారులలో నృత్యకళగా ప్రవృద్ధి పొందింది. ముఖ్యంగా దర్బారులలో ప్రేక్షకుల ముందు ప్రదర్శిస్తూండే

## తరంగ విద్యుత్తు

*కేరళలో తిరువనంతపురానికి ఉత్తరంగా 40 కి మీ ల దూరంలో విళిన్‌జమ్ (Vizhinjam) అనే మత్స్య గ్రామంలో ఏర్పాటైన ది వేవ్ ఎనర్జీ ప్రాజెక్ట్ (తరంగ విద్యుత్ యోజన) ఇప్పుడు కేరళ గ్రిడ్‌కి స్థిరంగా 80 KW విద్యుత్తును సరఫరా చేస్తూంది*

*మద్రాసు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో ఓషన్ ఇంజనీరింగ్ సెంటర్ తలపెట్టిన ఈ యోజన ఆసిలేటింగ్ వాటర్ కాలమ్ సిద్ధాంతంపై ఆధారపడిఉంది సముద్ర భూగర్భంలో లేవదీసిన పెద్ద నిడుపాటి కాంక్రీటు స్తంభం చేంబరు గదిగా ఉపయోగపడుతుంది తరంగాలు లేచినప్పుడు సముద్రపు మంచినీరు స్తంభంలోకి ప్రవహించి చేంబర్ గదిలోకి చేరుతుంది అక్కడ ఉన్నగాలి ఒకచిన్న రంధ్రం ద్వారా వెలికి తోయబడుతుంది. కెరటాలు వెనుకకు వెళ్ళినప్పుడు స్తంభంలో నీటిమట్టం బాగా పడిపోతుంది వెంటనే పైరంధ్రం గుండా గాలి లోపలకు చేరుతుంది నీటి మట్టం పెరిగినప్పుడు, తగ్గినప్పుడు వచ్చేగాలి ఇండక్షన్ మోటారుకు తగిలించిన టర్బైన్‌ను త్రిప్పుతుంది.*

*రూ.15 కోట్ల వ్యయంతో కూడిన ఈ యోజనతో ప్రపంచ వ్యాప్తంగా నీటి తరంగ విద్యుత్‌ను ఉపయోగించుకునే కొన్ని దేశాలలో భారతదేశం ఒకటి అయింది.*

— 'సిఐఇ-ఎన్ఎఫ్ఎస్'సౌజన్యంతో

"న్యాయంగా ఉంటే ఎవరూ పట్టించుకోరు, పొరబడితే ఎవరూ మరచిపోరు."

— ఐరిష్ సామెత

వారు. హిందూ రాజులు, మహమ్మదీయులు, నవాబులు అలనాపాలనలతో వారి ఆస్థానాలలోను, దర్బారులలోను పోషింపబడి అభివృద్ధి చెందింది ఆనాటి నుంచి దీనిలో భక్తిమార్గం లోపించింది దేవాలయాలలో ఆరాధన కార్యక్రమాలలో ముఖ్యమైన అంగంగా ఉండే కథక్ నృత్యం దేవదాసీలు చేయడం మానేసారు రాజుల, పాదుషాల దర్బారులలో ప్రవేశించిన తరువాత వారి అభిరుచులను అనుసరించి ఇది ఈ ప్రస్తుత రూపాన్ని ధరించింది కథక్ నృత్యంలో సంక్లిష్టమై లయబద్ధమైన పదవిన్యాసం ఇతర నృత్యరీతులలో కంటే వేరుగానూ, మిన్నగానూ ఉంటుంది పదవిన్యాసం అతిమెల్లిగా ప్రారంభమై వేగాన్ని పుంజుకుని ఉధృతంగా విలసిల్లుతుంది. కథక్ నృత్యంలో ప్రేక్షకులు నృత్యం చేసేవారి కళా కౌశలాన్ని, నైపుణ్యాన్ని తిలకిస్తూ ముగ్ధులై తన్మయత్వంతో ఆనందిస్తారు నాట్యకత్తె అభినయం, చూపులు అతి నాజూకుగా ఉంటాయి

మన శాస్త్రీయ నృత్యాలన్నిటిలో కథక్ ముఖ్యంగా రాజుల, ప్రభువుల, నవాబుల విలాసం కొరకు పోషింపబడింది. పాలరాతి వరండాలు, నగీషీలలాటిస్‌లు అమర్చిన బాల్కనీలు, రత్నమయ భూషితమైన దర్బారు హాలులు మొదలైనవన్నీ సంస్కారవంతంగా నృత్యానికి సామరస్యంగా ఉంటాయి. కథక్ మొగలాయి ప్రభువుల అభిరుచులు తీర్చడానికి తగినట్టుగా ఉండడం వల్ల దీనికి అపఖ్యాతి ఏర్పడింది. ఉన్నత వంశాలకు చెందిన స్త్రీలు ఇందులో పాల్గొనేవారు కాదు మొగలు సామ్రాజ్య పతనానంతరం కథక్ ప్రఖ్యాతి పూర్తిగా నశించింది అపఖ్యాతి పాలైంది

కానీ కల్కా, బిందాదిన్ వంశీయులు కొంత మంది దీని గౌరవ మర్యాదలను సంరక్షించారు మేనక మార్గ దర్శకత్వంలో కథక్ పునరుద్ధరించబడింది ఉత్తర భారతదేశంలో అనేక మంది తిరిగి కథక్‌ను పోషించారు ఈనాడు ఆవిర్భవించిన ప్రదేశంలో కదక్ మళ్ళీ ప్రవృద్ధి పొందింది. కథక్ నృత్యంలో లయబద్ధమైన పద విన్యాసం ప్రేక్షకులను సమ్మోహింపజేస్తుంది

●

## టెడ్డీ రూస్‌వెల్ట్ నిమిషానికి మూడు పేజీలు చదవగలడు


Teddy Roosevelt

*యునైటెడ్ స్టేట్స్ 26వ అధ్యక్షుడైన టెడ్డీ రూస్‌వెల్ట్ నిమిషానికి మూడు పేజీలు చొప్పున చదవగలడు ఇతడికి చేతిలో ఎప్పుడూ ఏదో ఒక పుస్తకం ఉండేది ప్రొద్దున డ్రెస్ చేసుకునేటప్పుడు కూడా యునైటెడ్ స్టేట్స్ ఉపాధ్యక్షుడు, అధ్యక్షుడు మరియు న్యూయార్క్ గవర్నరు అయిన రూస్‌వెల్ట్‌కి రోజుకి మూడు పుస్తకాలు చదవడానికి అవకాశం ఉండేది!*

## 210 IQ

*కొరియాకు చెందిన 4 సంవత్సరాల 8 మాసాల వయస్సు గల కుమ్ అంగ్-యాంగ్‌కి IQ 210 ఈ బాలుడు కొరియన్, ఇంగ్లీష్, జర్మన్ మరియు జపానీ భాషలలో మాట్లాడగలడు.*

"ఒకే రచయితను దొంగిలిస్తే అది గ్రంథచౌర్యం,పలు రచయితలను దొంగిలిస్తే అది పరిశోధన అనిపించుకుంటుంది."

# క్రీడారంగం

## 12 సంవత్సరాల బాలుడు స్వర్ణపతకం గెలుచుకున్నాడు

ఎడిన్‌బర్గ్ (బ్రిటన్)లో 1970వ సంవత్సరం కామన్‌వెల్త్ క్రీడలలో 12 సంవత్సరాల భారత మల్ల యోధుడు వేద్ ప్రకాష్ స్వర్ణ పతకాన్ని గెలుచుకున్నాడు

## అతివేగంగా గోల్ స్కోర్ చేసిన ఫుట్‌బాల్ క్రీడాకారులు



బారీ జోన్స్ కీత్ స్మిత్ మరియు ఆల్బర్ట్ ముండీ ఫుట్‌బాల్ క్రీడలో 6 సెకండ్లలో - రికార్డు స్థాయిలో అతివేగంగా గోల్ స్కోర్ చేసి ప్రఖ్యాతి పొందారు.

## వరుసగా నాలుగు టైటిల్స్ పొందిన ఆటగాడు

వరుసగా నాలుగు (1956, 1960, 1964, 1968) సార్లు ఒలింపిక్ డిస్కస్ త్రోలో అల్ ఒయెర్టర్ (యు.ఎస్.ఎ) టైటిల్స్ పొందాడు ఒకే ఆటలో నాలుగు సార్లు వరుసగా టైటిల్స్ పొందిన ఆటగాడు ఇతడు ఒక్కడే.

## వరల్డ్‌కప్ ఫుట్‌బాల్ పోటీ 1930లో ప్రారంభింపబడింది

వరల్డ్ కప్ ఫుట్‌బాల్ పోటీ 1930 జూలై 13న ఉరుగ్వే ముఖ్య నగరమైన మాంటెవీడియో (దక్షిణ అమెరికా)లో ప్రారంభింపబడింది నిర్వాహకులు ఇతర 13 దేశాలను ఓడించి ప్రప్రథమ శ్రేణి విజేతలనిపించుకున్నారు

## రాజవంశానికి చెందిన ఒకే క్రీడాకారుడు

వింబుల్‌డన్ టెన్నిస్ ఛాంపియన్ షిప్స్‌లో పాల్గొన్న బ్రిటన్ రాణి ఎలిజబెత్ II తండ్రి కింగ్ జార్జి VI - ఈ ఆటలో పాల్గొన్న రాజవంశానికి చెందిన ఒకే ఆటగాడు

## వింబుల్‌డన్ సింగిల్స్ టైటిల్ గెలుచుకున్న ప్రప్రథమ నల్లజాతివాడు

ఆల్దీ గిబ్సన్ వింబుల్‌డన్ సింగిల్స్ టైటిల్ గెలుచుకున్న నల్లజాతికి చెందిన ప్రప్రథముడు.

## మొదటి ఒలింపిక్ స్వర్ణపతకం పొందిన క్రీడాకారుడు

మొట్టమొదటి ఒలింపిక్ స్వర్ణ పతకాన్ని పొందిన క్రీడాకారుడు అమెరికన్ జేమ్స్ కొనోల్లీ ఇతడు 1896లో ట్రిపిల్ జంప్‌కి స్వర్ణ పతకం పొందాడు

"మిత వ్యయాన్ని నిరుత్సాహపరచి అభ్యుదయాన్ని సాధించలేరు."

# తెలుసుకోదగిన విషయాలు

## మిక్కిలి పెద్ద పాన్ లోఫ్

బాగా ఎర్రగా కాల్చిన మిక్కిలి పెద్ద 1435 కిగ్రాలు తూగే పాన్ లోఫ్ (రొట్టె)ను 1988 మార్చి 18 న దక్షిణ ఆఫ్రికాలో జొహనాస్ బర్గ్‌లో శాస్కోకు చెందిన సిబ్బంది తయారు చేసింది

## అతిపొడవైన రొట్టె

సుమారు 718.67 మీటర్ల పొడవైన రొట్టె అతిపొడవైన రొట్టెగా రికార్డు చేయబడింది. దీనిని నార్త్‌లాండ్స్ జాబ్ కార్ప్స్ వెర్జెన్నెస్, వెర్మోంట్, యు ఎస్.ఎ 1987 నవంబరు 3న తయారు చేసారు ఈ రొట్టె తయారీలో 16 టన్నుల పిండి ఉపయోగింపబడింది.

## మిక్కిలి పెద్ద కేక్

ఇంతవరకు తయారైన మిక్కిలి పెద్దకేక్ 7 35 టన్నుల ఐసింగ్‌తో 58 08 టన్నుల భారం ఉంది న్యూస్‌పేపర్ ఎడిటర్ గేరీ గెన్‌గోజియన్ యోచన ప్రకారం యునైటెడ్ స్టేట్స్‌లోని అలాబామాలో ఫోర్డ్ పెయినీ 100వ జయంతి సందర్భంగా అలాబామా రూపంలో తయారు చేయబడింది.

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన కేక్

ప్రపంచంలో 23 68 మీటర్ల మిక్కిలి ఎత్తైన కేకును మిసెస్ నిలాసరి అనే ఆమె 121 మంది సహాయంతో సురబాయా (ఇండోనేషియా)లో తయారుచేసింది వీరు దీనిని 1989 ఫిబ్రవరి 16న తయారు చేయడం ప్రారంభించి 1989 ఏప్రిల్ 9న ముగించారు.

— డా.కె.ఎస్.శశికాంత్

## మైనస్ ఫోర్స్




ఒకప్పుడు స్కాట్లండ్‌లో పాలసంస్థను గాంధీజీ సందర్శించినప్పుడు ఒక స్కాచ్ పౌరుడు ధరించిన దుస్తులు చూచి దానిని ఏమంటారు అని అడిగారు

'దీనిని ప్లస్ ఫోర్స్' అంటారు అంటూ అతడు 'మీరు ధరించిన దుస్తులను ఏమంటారు?' అని అడిగాడు

'మైనస్ ఫోర్స్' అని చెబుతూ గాంధీజీ కప్పుతున్న శాలువను తీసి కట్టిన అంగవస్త్రాన్ని చూపించారు.

## జీవితంలో హాస్యం



"సాధ్యమైతే వాదాలను వదలుకో. ముఖ్యంగా అసాధ్యమైనప్పుడు తప్పనిసరి."

# ఆరోగ్యాభివృద్ధికి పండ్లు కాయగూరలు

యు.ఎస్.నేషనల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు ఆహారం మరియు ఆరోగ్యం (Diet and Health) మీద ఇచ్చిన రిపోర్టులో ఎక్కువగా కొవ్వు పదార్థాలు తినడం వల్ల హృద్రోగాలను అభివృద్ధి చేసే ఎథీరోస్క్లెరోసిస్ (Atherosclerosis) పెరిగే అవకాశం ఉంటుందని వివరించబడింది.



మొత్తం తీసుకునే ఆహార పదార్థంలో కొవ్వు పదార్థాల వినియోగం 30 శాతం దాని కంటే తక్కువకు పరిమితి చేయబడితే గుండె రోగాల వల్ల కలిగే అపాయాలు తగ్గుతాయి. బాగా సాంద్రీకృతమైన ఫాటీ ఆసిడులను తినడం 10 శాతం కంటే మించకుండా ఉంటే హృదయ సంబంధమైన కార్డియాక్ సమస్యలు అసలు ఉండవు అదేవిధంగా కొలెస్టరాలు వినియోగం రోజుకి 300 మిల్లీ గ్రాముల కంటే తక్కువగా ఉంటే ధమనులు మూసుకుని పోవడం బాగా తగ్గిపోతుంది

జనం బాగా పండ్లు, కాయగూరలు తినాలని రిపోర్టు ఆదేశిస్తూంది ఆకుపచ్చ మరియు పసుపు రంగు కాయగూరలు ఎక్కువగా ఉపయోగించడం వల్ల ఊపిరి తిత్తుల కాన్సర్, వెన్నెముక, ఓసోఫేగస్ మరియు ఉదర సంబంధమైన రోగాలు నిరోధింపబడతాయి. సాంద్రీకృతమైన క్రొవ్వులు తీసుకోవడం వల్ల వెన్నెముక, ప్రోస్టేటు మరియు హృదయ సంబంధమైన రోగాలు ప్రవృద్ధి పొందుతాయి.

కాయగూరలు, పండ్లు రోజుకి సరిసమంగా అయిదారుసార్లు మరియు సంకీర్ణ కార్బో హైడ్రేటులు ఎక్కువగా తీసుకోవడం ఉత్తమం మొత్తం తీసుకునే కార్బోహైడ్రేటులు ఆహారం విలువలో 55 శాతం ఉండాలి మాంసకృత్తులు రోజుకి శరీరభారానికి కిలోకి 1 6 గ్రాములు కంటే అధికంగా తినకూడదు

## గోళ్ళు కొరకడం!

*మానసిక భావాన్ని ప్రదర్శించే ఈచేష్ట ఒక అభ్యాసంగా చిన్నప్పటి నుంచీ చాలామందికి ఉంటుంది గడ్డం నవరించుకోవడం, మాటి మాటికి చేతులతో జుట్టు వెనుకకు తోసుకోవడం, సిగరెట్లు కాల్చడం, వైను త్రాగడం వగైరాలన్నీ ఒకే రకానికి చెందినవి. గోళ్ళు కొరుక్కోవడం బొటనవ్రేలు నోటిలో పెట్టుకుని చీకడానికి ప్రత్యామ్నాయంగా ఏర్పడిందని కొందరి నిపుణుల అభిప్రాయం! కోపం, రోషం ప్రత్యక్షంగా ప్రదర్శించుకోలేక మనసులో అణిచిపెట్టుకోవడం వల్ల ఈ అలవాట్లు ఏర్పడుతాయి వాస్తవంగా ప్రతీకార భావాలను మ్రింగడం వంటిది*

*ఇటువంటి దురభ్యాసాలు మీకేమైనా ఉంటే వివేకంతో సాధించాలి గానీ మనసులో పెట్టుకో కూడదు. వీటిని ఎప్పటికప్పుడు కాగితం మీద వ్రాసి పెట్టుకుని వాటిని విశ్లేషించు కోవాలి ఈ విధంగా వ్రాసుకుని విశ్లేషించడం వల్ల కొన్ని రోజులకు మీ అభిప్రాయాలు, మీ భావాలు, ప్రత్యేక చర్యలు మీకే తెలిసి వస్తాయి చివరకు విజయం సాధించగలుగుతారు*

—'హిప్నాటిక్' సౌజన్యంతో

"సామాన్య పరిజ్ఞానం విద్యాఫలితం కాదు."

# సైలెంట్ వాలీ

ప్రశాంతమైన కొండలోయ సైలెంట్ వాలీ కేరళలో సుందరాతి సుందరమైన లోకోత్తర అటవీ ప్రదేశం ఇది భారతదేశం కేరళ రాష్ట్రంలో పాల్ఘాటు జిల్లాలో మన్నార్కాడ్ తాలూకాలో పశ్చిమ కనుమల మధ్య ఉంది




ఒక శాతం సూర్యరశ్మి మాత్రమే దట్టమైన చెట్ల నీడలగుండా భూమిమీద పడుతుంది ఇచ్చట వర్షపాతం చాలా అధికం సగటున సంవత్సరానికి 4,800 మి మీ లు ఇచ్చటి వృక్షజాలం, జంతుజాలం మలేషియా పెని న్సులా సతత హరితారణ్యా ఉష్ణ ప్రదేశాలు జావా ఆర్చిపెలాగో, సుమత్రా మరియు బోర్నియో వృక్షజాలాన్ని, జంతుజాలాన్ని పోలి ఉంటుంది

ఈ సైలెంట్ వాలీలో జంతుజాలం, వృక్ష జాలంపై మానవ ప్రభావం ఎంతమాత్రం లేకుండా అనేక సంవత్సరాల నుంచీ వృద్ధి పొందుతూంది. ఇక్కడ అటవీ ప్రదేశంలో కీచుమని శబ్దం చేసే సికాడా (Cicada)లు లేకుండా నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉండటం వల్ల దీనికి సైలెంట్‌వాలీ అనే పేరు సార్థక మైంది

అనేక రకాల జంతువులు, పక్షులు ఇక్కడ నివసిస్తున్నాయి. అంతరించిపోతూన్న సింహపు తోక కోతి, ఇండియన్ హార్న్‌బిల్ ఇక్కడ నివసిస్తున్నాయి ఈసైలెంట్ వాలీలో సుమారు 23 రకాల చెట్లు ప్రత్యేకంగా వృద్ధి పొందు తున్నాయి దట్టమైన ఈ అడవులలో తెలియని వృక్షజాలం ఎంతో ఉందంటారు.

సైలెంట్ వాలీ వంటి వర్షపుటడవులు భూమికి ప్రాణవాయువును సరఫరా చేస్తూ భూమిపై అవిచ్చిన్న జీవితానికి సహకరిస్తాయి. జీవావరణ సౌందర్యం కంటే ఆర్థికాభివృద్ధే ముఖ్యమనే అభిప్రాయంతో ఈ అడవులను నశింప జేస్తే దేశం వాతావరణంలో, వర్షపాతంలో, భూసారంలో తీవ్రమైన మార్పులు కలుగుతాయి సైలెంట్ వాలీ వంటి ప్రదేశాలను నాశనం చేస్తే హానికరమైన పరిస్థితులు ఏర్పడతాయి ●

## బియ్యపు గింజ మీద 7,576 అక్షరాలు

*తగిన నేర్పు, ఓర్పు, పట్టుదల ఉంటే ఎంతెంతో చిన్న చిన్న పనులు బ్రహ్మాండంగా, మహాద్భుతంగా నెరవేర్చవచ్చు 1929లో జేమ్స్ జహారీ 15 పైసా చిన్నసైజు స్టాంపు మీద 20,000 అక్షరాలు వ్రాసాడు అయిదు సంవత్సరాలు తరువాత ఇతడే ఒక బియ్యపు గింజ మీద 9,007 అక్షరాలు వ్రాసి వరల్డ్ ఛాంపియన్‌గా ప్రసిద్ధి పొందాడు*

*అతడికి తెలుసు అంతకంటే బాగా చేయగలనని డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్‌ని ఒక బియ్యపు గింజ పైన ఒక ప్రక్క కాపీ చేసి దానికి 3 కాలనీల పేర్లు, 56 సంతకాలు కూడా చేర్చి మొత్తం 7,576 అక్షరాలు వ్రాసాడు ఇతడే 2 1/2 అంగుళాల పొడవైన వెంట్రుక మీద లింకన్స్ గెట్టీస్‌బర్గ్ 1,150 మాటల ప్రసంగాన్ని వ్రాసాడు*

"నిత్య జీవితంలో కార్యోద్యుక్తులు సౌభాగ్యవంతులు."

# భక్తి శ్రద్ధలు ముఖ్యం

నీవు చేయవలసిన పనిని శ్రద్ధగా, విశ్వాస పూర్వకంగా పూర్తి చేయాలి. మీరు 'దేవుడు ఎక్కడ ఉన్నాడు?' అనే ప్రశ్న వేసినప్పుడు దానికి జవాబు ప్రకృతే ఇస్తుంది భూమి తనలోతాను తన ఇరుసు మీద గంటకు 1000 మైళ్ల వేగంతో తిరగడం వల్ల రాత్రింబవళ్లు


Sri Sathya Sai Baba

ఏర్పడుతున్నాయి. తనలోతాను తిరుగుతూ భూమి సూర్యుని చుట్టూ గంటకు 66,000 మైళ్ల వేగంతో తిరగడం వల్ల వివిధ ఋతువులు ఏర్పడుతున్నాయి. వానలు కురుస్తున్నాయి. పంటలు పండుతున్నాయి. ఈ విధంగా భగవంతుని ఆదేశంతో తిరుగుతూన్న భూమి ప్రాణులకు వాటివాటి ఆహారాన్ని అందిస్తూంది ఇది మనకు ప్రత్యక్షంగా దేవుడు ఉన్నాడని తెలియజేస్తుంది. ప్రకృతిని పరిశీలించి నేర్చుకోవలసిన పాఠం ఏమిటి? అది క్రియాశీలత - ఎవరి ధర్మం వారు చురుకుగా నిర్వర్తించుకోవాలి. ప్రకృతి నిరంతరం తన ధర్మం ఆచరిస్తూండడం వల్లనే లోకం అనేక లాభాలను అనుభవిస్తూంది సృష్టి యొక్క రహస్యం, మర్మం కూడా ఎవరి ధర్మం వారు భక్తి శ్రద్ధలతో ఆచరించడంలో ఉంది సృష్టి రహస్యం సృష్టికర్తకే తెలుస్తుంది సృష్టికర్త యొక్క ధర్మాన్ని తెలుసుకుని చివరకు ఆ సృష్టికర్తతో లీనం అయిపోవడమే పారమార్థిక మార్గం యొక్క పరమావధి

— శ్రీ సత్యసాయిబాబా

## ఒక్కసారి ఎదుటివాళ్లను గురించి ఆలోచించు



నీకు కష్టం అధికంగా ఉంటే ఎదుటి వాళ్లను గురించి ఒక్కసారి ఆలోచించు
నువ్వు మందగిస్తే వాళ్లు మానుకుంటారు
నువ్వు దుర్బలంతో బలహీనుడవు అయితే వాళ్లు వదిలేస్తారు
నువ్వు కూర్చుంటే వాళ్లు చేయరు
నువ్వు సంశయిస్తే వాళ్లకి విసుగు పుడుతుంది.
నువ్వు విమర్శిస్తే వాళ్లు నాశనం చేస్తారు
నువ్వు వెడుతూంటే నిన్ను వెంబడిస్తారు
నువ్వు చేయి ఇస్తే వాళ్లు కాళ్లు ఇస్తారు
నువ్వు ఆరాధిస్తే అంతకంటే పవిత్రవంతులు ఇంకొకరు ఉండరు

"ఏభైమంది సామాన్య శ్రామికుల పనిని ఒక మెషీను చేయవచ్చు. కానీ అసాధారణ ప్రజ్ఞావంతుని పని ఏ మెషీను చేయలేదు."

# అపూర్వ విషయాలు

## బీథోవెన్ అపూర్వ గానశిల్పి

జర్మన్ గేయకారుడు బీథోవెన్ (1770-1827) అపూర్వ గానశిల్పి. ఇతడి స్వరూప సమ్మేళనం, నైన్త్ (కోరల్) ఇతడు చెవిటివాడుగా ఉన్నప్పుడు రచించాడు

## తలపై వెంట్రుకలను నిక్కబెట్టగలడు!



ప్రఖ్యాత ఫ్రెంచి నటుడు పియెర్రీ మెస్సీ ఇష్టమైనప్పుడు తలపై వెంట్రుకలను నిక్కబెట్టగలడు!

## 1865లో ఫోర్డ్ థియేటర్‌లో లింకన్ కాల్చి చంపబడ్డాడు

యుఎస్ఎ వాషింగ్‌టన్ DCలో ఫోర్డ్స్ థియేటర్ 1893లో అకస్మాత్తుగా కూలిపోయింది వందల కొద్దీ జనం దానిక్రింద మరణించారు. అదే థియేటర్‌లో 1865లో అధ్యక్షుడైన అబ్రహాం లింకన్ కాల్చి చంపబడ్డాడు

## 4.79 కి.గ్రా.ల కారట్ దుంప

ఆస్ట్రేలియాలో విక్టోరియాకు చెందిన బాబ్ మెకెవాన్ 4 79 కి.గ్రా ల (11 పౌండ్ల) కారట్ దుంపను 1967 సెప్టెంబరులో ప్రవృద్ధిపరచాడు.

## ముగ్గురు దొంగలు

ఒకసారి ఒక వ్యక్తి రోడ్డు మీద ప్రయాణం చేస్తూండగా ముగ్గురు దొంగలు అతడిని పట్టుకుని వేధించి ఉన్నదంతా దోచుకున్నారు మొదటి దొంగ 'విణ్ణి చంపేద్దాం లేకపోతే ముందు మనకు కష్టాలు తప్పవు' అన్నాడు రెండవవాడు 'చెట్టుకు కట్టి వెళ్ళి పోదాం' అన్నాడు అతడిని ఒక చెట్టుకి కట్టి ముగ్గురూ వెళ్ళిపోయారు కొంతసేపటికి మూడవ దొంగ వచ్చి 'వీడి దగ్గర ఉన్నదంతా దోచుకున్నాం ఊరికే చెట్టుకు కట్టి ఉంచితే ఏంలాభం' అని చెప్పి కట్లువిప్పి ఆ వ్యక్తిని వదలిపెట్టాడు. మొదటి దొంగ తామస గుణం - అజ్ఞానానికి గుర్తు రెండవవాడు రాజస గుణానికి గుర్తు. మూడవవాడు సత్త్వ గుణానికి గుర్తు. తమో స్వభావం వల్ల మానవులు అనేక నేరాలకు పాల్పడతారు కష్టాలను పెంచుకుంటారు రాజస గుణం గలవారు కష్టాలను తగ్గించుకుంటారు సత్త్వ గుణం గలవారు ప్రాపంచిక బంధాలు లేక స్వాతంత్ర్యంగా ఉంటారు

—స్వామీ సంబుధానంద-'యువభారతి' సౌజన్యంతో

## ప్రపంచంలో బ్రహ్మాండమైన భవనం

యునైటెడ్ స్టేట్స్ కాలిఫోర్నియాలో శాన్ సైమోన్‌లో ఒకపెద్ద వార్తాపత్రిక అధికారి విలియం రాన్‌డాల్ఫ్ హార్‌స్ట్ (1865-1951) కి ప్రపంచంలో మిక్కిలి అధిక వ్యయంతో కూడిన బ్రహ్మాండమైన స్వంత భవనం ఉంది. 30 మిలియను డాలర్ల వ్యయంతో దీనిని నిర్మించడానికి 17 సంవత్సరాలు పట్టింది. పసిఫిక్ మహాసముద్రానికి ఎదురుగా ఉండే ఈ భవనంలో 100 గదులు ఉన్నాయి. దీంట్లో 83 అడుగుల పొడవైన సభామండపం, 104 అడుగుల పొడవైన వేడినీటి స్విమ్మింగ్ పూల్, 25 కార్లకు సరిపోయే గారేజి కూడా ఉన్నాయి.

"మానసిక దుర్బలుల శరణ్యం సోమరితనం."

# వంతెన క్రింద నీరు

ఈసారి మీరు వంతెన మీద నడిచేటప్పుడు ఒక్కసారి ఆగి జాగ్రత్తగా గమనించండి క్రింద ప్రవహిస్తూన్న నీటిని పరీక్షించండి. లయబద్ధంగా నీరు ప్రవహిస్తుంది కలత ఉండదు. విభిన్నత కనిపించదు అనేక నీటి బిందువులు చేరి నీటి ప్రవాహం ఏర్పడుతుంది, పారుతుంది, ప్రవహిస్తుంది



మన జీవితం అలాగే ఉంటుంది నిశ్చలమైన ప్రవాహం ఆనందకరం. కానీ ఒక్కొక్కప్పుడు జీవిత ప్రవాహం నిరుత్సాహంతో మందకొడిగా సాగుతుంది. ఒక్కొక్కప్పుడు ఉత్సాహంగా వడి వడిగా గడిచిపోతుంది. ఒక్కొక్కప్పుడు జీవితం శూన్యంగా ఎండి పోయిన ఎడారిలా ఉంటుంది నిర్జీవంగా కనిపిస్తుంది.

ఒక్కోసారి వంతెన క్రింద నీరు అల్లకల్లోలంగా ప్రవహిస్తుంది. వంతెనకు కొడుతుంది. వంతెనను కదిలించివేస్తుంది. గట్లను కోసేస్తుంది - కోరేస్తుంది గట్లను పడేస్తుంది వంతెన స్తంభాలు ఎంత గట్టిగా, ఎంత లోతుగా ఉన్నా నీటి ఒత్తిడికి అరిగిపోతాయి. పటిష్టంగా లేని స్తంభాలు పడిపోతాయి వంతెన కూలిపోతుంది.

వంతెన క్రింద నీరు ఎప్పుడూ నిశ్చలంగా, శాంతంగా ఉండదు ఎప్పుడూ గంభీరంగా పొంగిపొర్లదు. అలాగే ఎవ్వరి జీవితం కూడా అంధకారమయం కాదు. ఎప్పుడూ ఒంటరిగా ఏకాకిగా ఉండదు. అప్పుడప్పుడు ఆనందకరమైన మధుర క్షణాలు ఏర్పడుతూంటాయి హాయిగా ఉండే అవకాశాలు కలుగుతుంటాయి. జీవితం జీవించడానికే అని అనిపిస్తుంది

వంతెన క్రింద ప్రవహించే నీరులాగే జీవితం గడిచిపోతుంది తెలియని చోట్ల నుంచి తెలియని ప్రదేశాలకు దానిని నీవు పట్టుకోలేవు. నీరు బీభత్సం అల్లకల్లోలంగా ఉంటే కాసేపు నిరీక్షించాలి "ఇది కూడా గడిచిపోతుంది" నీరు ఎంత ఉధృతంగా లేస్తే అంతవడిగా ప్రవహిస్తుంది ఆ తరువాత అంతా శాంతమే. గంభీరమే.

## ఎనాటికైనా కష్టాలు తీరతాయా?

*మానవుడికి మోక్షం కనిపించడం లేదు ఏక్షణాని కాక్షణం విచారంతో, బాధతో భయపడి వణికిపోతున్నాడు. జీవిత పరిణామంలో వ్యాధులతో, రోగాలతో కృంగి కృశించిపోయి మరణిస్తున్నారు. నిరాశ నిరుత్సాహాలే చివరికి మానవుని ప్రారబ్ధం అనిపిస్తూంది. ఈ సమస్య విశ్వవ్యాప్తంగా ఉంది ఏంచేయగలడు? ఈ కష్టాలు ఏనాటికైనా తీరతాయా? విశ్వవ్యాప్తంగా అందరికీ అవసరమే విడుదల.*

మానవుడు ముఖ్యంగా తాను చేసుకున్న కష్టాలలో, విచారాలలో తాను మునుగుతున్నాడు. మానవుడు ఒక మిథ్యా స్మృతి లోకంలో ఉన్నాడు లోపలి భావాలే పైన ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. బయట మార్గం కోసం తాపత్రయ పడటం అనవసరం. దీనికి మార్గం లోపలే ఉంది ఆత్మ విచారంతో మానవుడు మాయలోంచి బయట పడగలడు

మానవుడు ఈ మార్గం తెలుసుకోవడం ధ్యానం.

"సత్యమూ, ధర్మమూ కోల్పోని మనిషి నాస్తికుడైనా ఫరవాలేదు."

# అవీ-ఇవీ

## ప్రార్థనకు హెచ్చరికనిచ్చే చేతి గడియారం

ముస్లిములు ప్రపంచంలో ఎక్కడ ఉన్నా సకాలంలో వారికి ప్రార్థనకు హెచ్చరికనిస్తూ సౌదీ అరేబియాలో మక్కా నగరం దిక్కును సూచించే అపూర్వమైన చేతి గడియారాన్ని ఒకదానిని జపాన్‌లో సీకో కంపెనీ అభివృద్ధి చేసింది. ఒక రోజుకు అయిదుసార్లు అలారం కొట్టి దీనిని పెట్టుకున్న ముస్లిములు ఎక్కడ ఉన్నా ప్రార్థన సమయాన్ని జ్ఞాపకం చేస్తుంది!

## చెత్తను పరిష్కరించే ఇన్‌సినిరేషన్ ప్లాంట్

అత్యంత అపాయకరమైన చెత్తను సుమారు 1,600 డిగ్రీల సెంటీగ్రేడు అత్యధిక ఉష్ణోగ్రత దగ్గర పరిష్కరించే క్రొత్త విధానాన్ని ఆస్ట్రియాలో ఒక ఇంజనీరింగ్ బృందం అభివృద్ధి చేసింది. ఉపయోగించిన నూనె, కారు టైరులు, ప్లాస్టిక్కులు, అపాయకరమైన భారలోహాలు మొదలైన వ్యర్థ పదార్థాలను నిరపాయకరమైన వాయువులుగా మార్చడానికి ఈ సాంకేతిక విధానం సహకరిస్తుంది. ఈ క్రొత్త ఇన్‌సినిరేషన్ ప్లాంట్‌కి వ్యర్థ పదార్థాలను నిరపాయకరంగా శిథిలపర్చే సాధనాలు అమర్చబడ్డాయి. ఈవిధంగా ఉత్పాదింపబడిన గాస్ విద్యుచ్ఛక్తికి ముడి పదార్థంగా పునర్వ్యవస్థీకరించబడుతుంది. మండిపోయిన తరువాత మిగిలే మడ్డిని జీవావరణ సంబంధమైన తటస్థ నిర్మాణ పదార్థంగా ఉపయోగించవచ్చు.

— 'సి ఇ ఇ-ఎన్‌ఎఫ్‌ఎస్'సౌజన్యంతో

## పాత పుస్తకాలను భద్రపరచాలంటే

ఫ్రాంక్‌ఫర్ట్ బాటిల్లే ఇన్‌స్టిట్యూట్ (జర్మనీ) ప్రాచీన గ్రంథాలను చాలాకాలం భద్రపరచడానికి ప్రత్యేక రసాయనిక ద్రవపు ముంపుడు విధానాన్ని అభివృద్ధి పరచింది తరువాత ఇవి మైక్రో వేవ్ రేడియేషన్ ప్రక్రియకు గురికాబడతాయి. అప్పుడు ఇవి అనేక సంవత్సరాల పాటు చెడిపోకుండా ఉంటాయి.

## సహజ కీటకాలు

పరిసరానుగుణ్యంగా వ్యవసాయరంగంలో సహజ కీటక నివారణకు అభివృద్ధి పొందుతూన్న అనేక ఉష్ణప్రదేశాలలో తీవ్రచర్యలు తీసుకోబడుతున్నాయి. వీటికి ఇక్కడ సాంప్రదాయక విరుద్ధమైన విధానాలు అనుసరించబడుతున్నాయి. కీటకనాశినికి క్రొత్తగా శిలీంధ్రములు, పరాన్న భుక్కులైన పురుగులను తినే ఇతర కీటకాలు మొదలైన వాటిని ఉపయోగిస్తున్నారు ఈక్వడార్ (దక్షిణ అమెరికా)లో కెన్యా నుండి దిగుమతి చేయబడిన ఒకరకం సహజకీటకాన్ని బ్రిటన్ లాబొరేటరీలలో అత్యధికంగా భారీ ఎత్తున ఉత్పత్తి చేసి, కాఫీ తోటలలో కాఫీ బోరర్ నివారణకు ఉపయోగిస్తున్నారు. సూడాన్‌లో ప్రత్తికాయ తొలుచుడు పురుగు నివారణకు రసాయనిక కీటక నాశినులు నిష్ప్రయోజకరంగా ఉంటే ఒకరకం సహజ కీటకం చాలా అమోఘంగా పనిచేసింది.

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్'సౌజన్యంతో

## ఓజోన్ పొర తగ్గిపోవడం వల్ల చర్మ సంబంధమైన కాన్సర్ పెరగవచ్చు

భూమి మీద ఓజోన్ పొరను తగ్గించే వస్తువుల

"మనిషి ఆస్తికుడైనా, నాస్తికుడైనా వచ్చేదీ, పోయేదీ ఉండదుగానీ అతడు సచ్ఛీలతను కోల్పోతే మటుకు సమాజానికి పెద్ద అపకారమే జరుగుతుంది."

ఉపయోగాన్ని సగానికి సగం తగ్గించాలనే అంతర్జాతీయ ఒప్పందం ప్రకారం క్లోరోఫ్లోరో - కార్బన్స్ (CFCs) ఉత్పాదనను ఒక సంవత్సరం లోపల 1986 వ సంవత్సరంలో వాటిని ఉత్పాదించిన నిష్పత్తికి తగ్గిస్తారు. దీనిని 1993 నాటికి ఇంకా 20 శాతం, 1998 నాటికి ఇంకో 50 శాతం తగ్గిస్తారు. క్లోరోఫ్లోరో కార్బన్ (CFCs)లు సామాన్యంగా రిఫ్రిజిరెంట్లలోను, సాల్వెంట్లలోను, ప్లాస్టిక్ నురగను పెంచడానికి ఉపయోగపడతాయి. సిఎఫ్‌సి ఉపయోగం వల్ల భూమిని రేడియేషన్ నుండి రక్షించే ఓజోన్ పొర (భూతలానికి పైన 6 మొదలు 30 మైళ్ల మధ్య) పలచబడిపోతూంది. ఈ విధంగా ఓజోన్ పొర నష్టపడిపోవడం వల్ల మానవులలో చర్మ సంబంధమైన కాన్సర్ వృద్ధి కావచ్చు అనీ, పంటలకు హాని సంభవించవచ్చునీ శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు.

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్'సౌజన్యంతో

## రేడియేషన్ టెక్నాలజీ

డ్నెప్రోపెట్రోవిస్క్ (Dnepropetrovsk) నగరంలో యుక్రేనియన్ నిపుణులు పారిశ్రామిక వ్యర్థపదార్థాలను అమూల్యమైన పదార్థాలుగా మార్చడానికి రేడియేషన్ సాంకేతికతను కనిపెట్టారు ఎలక్ట్రాన్ కిరణాల సమూహం పదార్థాన్ని గట్టిపరచి దానిపై బాహ్య వస్తువు ప్రభావం లేకుండా చేస్తుంది కృత్రిమంగా పాలరాతిని తయారు చేయడానికి ఖర్చు సహజ పాలరాతి ఖర్చులకు ఎనిమిదిరెట్లు తక్కువగా ఉంటుంది ప్రతీ సంవత్సరం ఫాక్టరీలు పరిసర ప్రదేశాలను కల్మషపరచే మిలియనుల కొద్దీ వ్యర్థ పదార్థాలను వదులుతున్నాయి ఇవి పరిసర వాతావరణాన్ని కలుషితం చేస్తాయి. కార్డ్‌బోర్డ్ ఇండస్ట్రీలలో వ్యర్థ పదార్థాలను పెద్ద పెద్ద భవనాలకు అలంకరణార్థం కోసం పెద్ద పెద్ద ప్లేట్లుగా తయారు చేయవచ్చు

## భారతదేశపు మిక్కిలి పెద్ద ఇంజనీరింగ్ కాంపస్

సుమారు 5,000 విద్యార్థులతో మద్రాసులోని అన్నా యూనివర్సిటీ భారతదేశంలో మిక్కిలి పెద్ద ఇంజనీరింగ్ ఎడ్యుకేషన్ కాంపస్ ఇక్కడ ఇంజనీరింగ్ టెక్నాలజీలో 750 విద్యార్థినులు ఉన్నారు ఇంత ఎక్కువ మంది ఇంకెక్కడా లేరు.

## గడ్డి నుండి మెడోవుడ్

అమెరికా రైతులు మిగిలిపోయిన గడ్డి నుంచి మెడోవుడ్‌ను (Meadowood) అభివృద్ధి చేసారు ఒకరకం లాంగ్ గ్రాస్ (గడ్డి)ని రెసిన్స్‌తో ప్రత్యేక ఉష్ణోగ్రత దగ్గర ఒత్తిడితో స్ట్రాబోర్డ్‌గా తయారు చేస్తారు ఇది వంచడానికి వీలుగా ఉండటం వల్ల ఏరూపంలో కావాలో ఆ రూపంలో తయారు చేసుకోవచ్చు మెడోవుడ్ ముఖ్యంగా అలంకరణకు ఇంటీరియర్ పానెల్స్‌గానూ, పాలెట్స్‌గానూ, టేబిల్‌టాప్స్‌గానూ ఉపయోగపడుతుంది.

●

## ఉత్తర ప్రదేశ్‌లో గోధుమ సాగుబడి

*గోధుమ సాగుబడి క్రింద అత్యధిక విస్తీర్ణం ఉత్తరప్రదేశ్‌లో ఉంది తరువాత మధ్యప్రదేశ్, పంజాబ్, బీహార్, హర్యానా మరియు రాజస్థాన్ వస్తాయి ఉత్తర ప్రదేశ్ గోధుమ పంట గరిష్ట ప్రమాణం 36 50 శాతం పంజాబ్‌లో 24 5 శాతం భారతదేశం మొత్తం మీద సగటు గోధుమ ఫలసాయం హెక్టేరుకి 1993 కి గ్రాలు.*

*— 'యోజనా' సౌజన్యంతో*

"ప్రపంచం మిథ్య అని తెలుసుకున్న రోజున కోరికలు వెంటనే అదృశ్యమైపోతాయి"

పరాజయం అనుభవానికి మరో మాట పరాజయాలు పొందడం, నిరుత్సాహం చెందడం, ఆశలు నిరాశలు అవడం సహజం ఆటంకాలు కలుగుతాయని శ్రమకు భయపడి అధములు అసలు ఏ పనిని మొదలు పెట్టరు చేప[illegible]. పనిలో విఘ్నాలు కలిగినప్పుడు మధ్యములు ప్రారంభించిన పనిని మధ్యలో వదలిపెడతారు



ధైర్యవంతులు ప్రయత్నంలో ఎన్ని విఘ్నాలు ఏర్పడ్డా ధైర్యంతో మొదలు పెట్టిన కార్యాన్ని వదలరు. దీక్షతో కొనసాగిస్తారు

చదివే విధానంలో లోపం ఉన్నా, తగిన పరిశ్రమలో లోపం ఉన్నా ఒకరు పరీక్షలో ఉత్తీర్ణులు కాలేకపోవచ్చు ఏ పనిలోనైనా విఘ్నం ఏర్పడడానికి సరైన మార్గం అనుసరించక పోవడమే ముఖ్య కారణం లేకపోతే మన శక్తి సామర్థ్యాలకు, తాహతుకు మించిన అత్యున్నత ఆశయాలు, ఆశలు ఉండవచ్చు. ఇటువంటి పరాజయాల వల్ల భయపడిపోయి నిరుత్సాహం చెందిపోనక్కరలేదు. ఇనుమడించిన సామర్థ్యంతో నేర్పుగా తిరిగి ప్రారంభించాలి.

'పరాజయం అనేది విజ్ఞానవంతంగా తిరిగి ప్రారంభించడానికి ఒక సదవకాశం' అని హెన్రీ ఫోర్డ్ అన్నాడు. 'ప్రతీసారి పడిపోయి నప్పుడల్లా ధైర్యంగా లేవడమే మన గొప్ప తనం' అని గోల్డ్‌స్మిత్ అన్నాడు.

విండెల్ ఫిలిప్స్ 'ఓడిపోవడం అంటే ఏమిటి? నేర్పుతో ఉన్నతికి మొదటి అడుగు' అని అన్నాడు. హెర్బర్ట్ కాసన్ చెప్పింది వాస్తవం 'ప్రయోగాలు లేకుండా ప్రగతి ఉండదు అపజయాలు లేకుండా ప్రయోగాలు ఉండవు' అనేదే వాస్తవమైన మన జీవిత విధానం పరాజయం అనేది మనల్ని అణచి వేయడానికి కాదు. డి స్ కాంబెల్ చెప్పినట్టు ఉత్సాహంతో తిరిగి ప్రారంభించడానికే ఒక అవకాశం హెచ్ డబ్ల్యు బీచర్ చెప్పినట్టు 'అపజయాలు మానవునికి, శక్తి సామర్థ్యాలు కలిగించి అజేయుడిగా చేస్తాయి పరాజయాలకు భయపడకు'. అడ్డు మెట్లే స్వర్గానికి దారి తీస్తాయి అనే సామెత మరచి పోకూడదు.

—'ఐడియాస్ ఎక్చేంజ్' సౌజన్యంతో ●

## మొట్టమొదటి టెక్స్టైల్ మిల్

*మొట్టమొదట 1818లో బౌరీహ్ అనే ఆంగ్లేయుడు కలకత్తాలో టెక్స్టైల్ మిల్‌ను ప్రారంభించడానికి ప్రయత్నాలు చేసాడు. దీనికి బౌరీహ్ కాటన్ మిల్స్ కంపెనీ అని పేరు పెట్టబడింది దక్షిణ భారతదేశంలో ఆండ్రూ మరియు ఫ్రాంక్ హార్వే అనే ఇద్దరు ఆంగ్లేయులు 1883లో తిన్నెవేలీ మిల్స్ కంపెనీ స్థాపించారు. దక్షిణాదిని పాండిచ్చేరిలో ఇంకొక ప్రప్రథమ ప్రయత్నం 1828 లో ఫ్రెంచి అంబాసడర్ ప్రారంభించాడు. ఇది బ్లిన్ అండ్ డెల్‌రిక్ హిల్ అనే పేరుతో ప్రారంభింపబడింది.*

—'యోజనా' సౌజన్యంతో

"అన్యాయార్జిత లాభాల వల్ల పొందే కలకాల నష్టం కంటే న్యాయార్జిత నష్టం వల్ల పొందే తాత్కాలిక కష్టం ఎంతో మేలు."

# పెలికాన్

దుర్గా పటాన్కర్

ప్రాచీన కాలపు పక్షిజాతికి చెందినది పెలికాన్. దీని మిక్కిలి పెద్ద ముక్కును చూచి కడుపులో పట్టే దానికంటే పెద్ద దానిని ముక్కుతో పట్టుకుంటుంది అనుకుంటారు. దీని తోక, కాళ్ళు పొట్టి, రెక్కలు పొడవుగా ఉంటాయి పెద్ద సంచి ఉంటుంది కాలివ్రేళ్ల




మధ్య చర్మం ఉండటం వల్ల ఇవి భూమి మీద సౌకర్యంగా నడవలేవు. ఏదైనా పెలికాన్ పక్షులు ఎగురుతూంటే చూడడానికి ఎంతో ఆనందంగా ఉంటుంది.

పెలికాన్ పక్షులు ప్రపంచంలో మిక్కిలి పెద్ద పక్షులు. వీటి రెక్కల నిడివి 2.75 మీటర్లు. బాగా పెరిగిన తరువాత ఇవి సుమారు 15 మొదలు 11 కి.గ్రా.ల భారం తూగుతాయి. సామాన్యంగా మధ్యతరహా ఉష్ణ ప్రదేశాలలో నివసిస్తాయి. హంగేరీ, మధ్య ఆసియా, ఇరాక్ మరియు పర్షియన్ గల్ఫ్ ప్రదేశాలలో విస్తారంగా నివసిస్తాయి. వీటి రెక్కల నిర్మాణం చలికి అంత రక్షణను ఇవ్వదు కాబట్టి ఇవి శీతాకాలంలో భారతదేశం, ఆఫ్రికా, ఇరాన్ దేశాలకు వలసలు పోతూంటాయి.

గోధుమ రంగు పెలికానులు మాత్రమే ఆహారం కోసం బాగా ఎత్తు నుంచి నీటిలో మునిగి లోతుగా డైవ్ చేస్తాయి.

ఇతర ఆరు పెలికాను జాతులకు రెక్కలు తెల్లగా ఉంటాయి పైన నలుపు లేక గోధుమ రంగు మచ్చలు ఉంటాయి. ఇవి రెండు రకాలుగా విభజింపబడుతున్నాయి. గ్రేట్‌వైట్ పెలికాన్ అమెరికన్ వైట్ జాతివి. మరియు ఆస్ట్రేలియన్ పెలికానులు డాల్మేటియన్ పెలి

## సుభాషితాలు

*జిహ్వ రుచుల గోరు జీవించు నంతకు*
*నతియు బతియు గోరు సుతుల ధనము*
*హవ్యవహుడు చూడనందఱగోరును*
*విశ్వదాభిరామ వినురవేమా!*

*[బ్రతికి ఉన్నంతకాలం నాలుక రుచులను కోరుచుండును. భార్యాభర్తలు పుత్రులను, సంపదలను కోరుదురు. అగ్ని అందరిని మ్రింగడానికి కోరుతుంది.]*

* * *

*మాటలాడవచ్చు మనసు దెల్పగలేదు*
*తెలుపవచ్చు దన్ను తెలియలేదు*
*సురియబట్టవచ్చు శూరుడు కాలేడు*
*విశ్వదాభిరామ వినురవేమా!*

*[ఒకరితో మాట్లాడటం సులభమే కానీ మనస్సును తెల్పుట కష్టం. ఎన్నైనా చెప్ప వచ్చును గానీ తనను తాను తెలుసుకోలేడు. కత్తిబట్టవచ్చుగాని పట్టినంత మాత్రాన శూరుడు కాలేడు.]*

"తనకు మాత్రమే దుఃఖాన్ని లేకుండా చేసుకునే ప్రయత్నంలో ఇంకెందరికో దుఃఖాన్ని కలిగిస్తున్నాడు మనిషి."

కానుల జాతికి చెందినవి

పెలికానులు భూమి మీద పుల్లలు, కంప దగ్గరగా చేర్చిన గూళ్లను నిర్మించుకుంటాయి ఆసియా దేశపు చుక్కలముక్కు మరియు ఎర్రముక్కు జాతి పెలికానులు చిన్న జాతి పెలికానులు ఇవి చాలా తక్కువగా ఉన్నాయి

పెలికానులు చాలా కలుపుగోరుతనంగా ఉంటాయి ఇవి చేరి ప్రయాణాలు చేస్తాయి, విశ్రాంతి తీసుకుంటాయి. గూళ్లు నిర్మించు కుంటాయి. కలిసి చేపలను పట్టుకుంటాయి. వీటిలో ముఖ్యంగా గ్రేట్‌వైట్ పెలికాన్ చాలా నైపుణ్యంగా చేపలను పట్టుకుంటుంది ఎనిమిది మొదలు పది పెలికానులు అర్థ వృత్తాకారంలో గుంపుగా చేరి నీటిలో ముందుకు ఈదుకుంటూ వస్తాయి ఇవి ముక్కును నీటిలో ముంచే ముందు రెక్కలను విప్పుకుంటాయి. ఈవిధంగా నీటిపై ఏర్పడ్డ నీడల వల్ల చేపలు భ్రాంతి చెంది వాటికి సులభంగా దొరుకుతాయి. పెలికానులు ముఖ్యంగా జతకూడే సమయంలో చాలా బెదిరిపోతూంటాయి. కాబట్టి ఎవరైనా దగ్గరకు వెడితే చాలు గూళ్లను వదిలేసి ఎగిరిపోతాయి. సాధారణంగా 35-37 రోజుల తరువాత సుద్ద తెలుపు గ్రుడ్డు నుంచి 3-4 పిల్లలు పుడతాయి. పుట్టినప్పుడు వీటికి ఈకలు ఉండవు. తరువాత త్వరగా వీటికి ఈకలు పెరుగుతాయి. తగిన రక్ష కలుగుతుంది.

పెలికాన్ గూళ్లు ఆహారం దొరికే ప్రదేశానికి చాలా దూరంగా ఉంటాయి. అందుచేత పెద్ద పెలికానులు ఆహారం తినడానికి, సంపాదించ డానికి చాలా దూరం ఎగిరిపోవలసి వస్తుంది. చిన్నవాటికి జీర్ణించిన ఆహారం పెడతాయి. పెద్దవాటి గొంతుకలో నుంచి చిన్నవి ఆహారం తీసుకుంటాయి. రెండు నెలలకు చిన్నవాటికి రెక్కలు పెరుగుతాయి. మూడు, నాలుగు సంవత్సరాలకు బాగా పెరిగిన తరువాత ఇవి పిల్లలు పెడతాయి

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## అతడొక ట్రావెలింగ్ సేల్స్‌మెన్


Einstein

అనేక సంవత్సరాలకు పూర్వం ఆల్బర్ట్ ఐన్‌స్టైన్‌కి పారిస్‌లో సొరోబోనే యూనివర్శిటీ డిగ్రీని ఇచ్చి గౌరవించింది. మరునాడు అతని బంధువు ఒకడు చిన్న హోటల్‌లో ఉన్న అతనికి టెలిఫోను చేసాడు

"నేను ప్రొ. ఐన్‌స్టైన్‌తో మాట్లాడాలి" అన్నాడు. దానికి 'ఇక్కడ ప్రొఫెసర్ ఐన్‌స్టైన్ లేడు' అని జవాబు వచ్చింది.

"ఔను ఉన్నాడు, నేను నిన్న అక్కడికి వచ్చాను" అని అతడు అన్నాడు.

'నీవు ఆల్బర్ట్ ఐన్‌స్టైన్ సుప్రసిద్ధ వైజ్ఞానికుడు గురించి మాట్లాడుతున్నావా? అని హోటల్ ప్రొప్రైయిటర్ ఆశ్చర్యంతో అడిగాడు. ఇక్కడ ఒకడు ఉన్నాడు ఐన్‌స్టైన్ అని, అతడు ట్రావెలింగ్ సేల్స్ మన్ అనుకుంటాను! అని అతడు బదులిచ్చాడు.

" యుక్తాయుక్త విచక్షణలో తనదని తేలినది మాత్రమే స్వధర్మం అవుతుంది."

ఒకసారి స్వర్గంలో సద్గుణులైన నీతి మంతులు, ఉత్తమ గుణవంతులందరికీ ఒక గొప్ప విందు ఏర్పాటు చేయబడింది ఆ విందుకు ఎంతోమంది పెద్దలు, చిన్నలు, గుణవంతులు అందరూ వచ్చారు అంతా ఒకరిని ఒకరు పరామర్శించుకుంటూ సుముఖంగా కనిపించారు అందరూ సద్భావంతో ఉత్సాహవంతంగా ఉన్నారు



అకస్మాత్తుగా దేవుడు పరస్పరం తెలియని ఇద్దరు మహిళలను పిలిచాడు వీరిద్దరిని పరస్పరం పరిచయం చేయడానికి ఒక ఆమె చేయి పట్టుకున్నాడు. 'దయా' అంటూ మొదటి స్త్రీని చూసి, రెండవ ఆమెను చూసి 'కృతజ్ఞత' అన్నాడు. దయా, కృతజ్ఞతలు రెండూ ఆశ్చర్యపడిపోతూ కరచాలనం చేసు కున్నాయి. ప్రపంచం సృష్టింపబడిన తరువాత ఇదే మొదటిసారి వారిద్దరూ కలుసుకోవడం.

ఎంతమాత్రం ఆశ్చర్యం లేదు. ప్రేమ ఎంత సర్వాధికారంతో ఉన్నా గుర్తించబడక పోవడం వల్ల కాంతి హీనమై పోతుంది. కృతజ్ఞత అనేది మనకు చేసిన ఉపకారానికి అభినందిస్తాం. ప్రత్యుపకారం చేస్తాం

కృతజ్ఞత సూర్యకాంతి వంటిది. సూర్య కాంతి లేకుండా కూడా ఉండగలం ఉంటే దాని వేడిని అనుభవిస్తాం జీవితం అంతా కాంతివంతం చేస్తుంది

ప్రేమ, సేవ దర్మాలకు అతి సన్నిహితంగా ఉండే కృతజ్ఞతను గురించి సిసిరో దీనిని సద్గుణాలకు తల్లి వంటిది అన్నాడు అన్ని ధర్మాలలో అతి ముఖ్యమైనది కృతజ్ఞత

కృతజ్ఞత అనేది మర్యాద తక్కువ కాదు ఇది నీ గొప్పతనాన్నీ సౌజన్యతను తెలియజేస్తుంది నీకు ఒకరు దయాదాక్షిణ్యాలతో సహాయం చేసి నప్పుడు నీ హృదయం కృతజ్ఞతతో,సంతోషంతో ఉప్పొంగనీ

ఒక పెద్ద భవనంపైన వాయు సూచని (Weather-Cock) ఉంటుంది ఇది ఆకాశంలో భవనంపైన గాలి అనక, వాన అనక తిరుగుతూ ఉంటుంది ఇది భవన బలిష్టతకు ఎంత మాత్రం సహకరించదు దయాదాక్షిణ్యాలు లేనివారు జీవించి ప్రయోజనం లేదు

—'శ్రీ సత్యసాయి బాల్‌వికాస్' సౌజన్యంతో

●

## ప్రపంచంలో బ్లూ తిమింగిలానికి గుండె చాలా పెద్దది

*తన పిల్లలకు పాలిచ్చి పోషించే పెద్ద సముద్రపు చేప బ్లూ తిమింగిలం గుండె ప్రపంచంలో చాలా పెద్దది ఇది సుమారు 1,300 పౌండ్ల భారం తూగుతుంది దీనికి 60 టన్నుల చర్మం మరియు ఎముకల భారం, ఒక టన్ను ఊపిరితిత్తులు, 8 టన్నుల రక్తం మరియు 50 టన్నుల కండరాలు కూడా చేరతాయి*

"సాధనమార్గంలో పయనింపదలచుకున్న జిజ్ఞాసువులకు మనో విభ్రమాలు, చిత్త చాంచల్యాలు తప్పనిసరి."

# మీకు తెలుసా?

## ప్రిన్స్ ఆఫ్ పర్సనల్ కంప్యూటర్

ఆపిల్ కంప్యూటర్ ఇన్‌కార్పొరేషన్ (యునైటెడ్ స్టేట్స్)కి చెందిన స్టీవెన్ జాబ్స్‌కి మరో పేరు 'ప్రిన్స్ ఆఫ్ పర్సనల్ కంప్యూటర్'.

## ఇండియన్ ఎయిర్‌ఫోర్స్ దీక్షా వాక్యము



'టచ్ ది స్కై విత్ గ్లోరీ' (ప్రతాపంతో ఆకాశాన్ని అంటు) అనేది ఇండియన్ ఎయిర్ ఫోర్స్ దీక్షావాక్యము (Motto).

## గ్రీస్ జాతీయ నృత్యము

కలమేటియానోస్ (Kalamatianos) గ్రీస్ (యూరప్) దేశపు జాతీయ నృత్యం

## భారత సైన్యంలో అత్యధిక ఉన్నత పదవి

'ఫీల్డ్ - మార్షల్' పదవి భారత సైన్యంలో అత్యధిక ఉన్నత పదవి.

## టగ్ ఆఫ్ వార్

టగ్ ఆఫ్ వార్ (క్రీడ)లో విజేతలు వెనుకకు వెడతారు, పరాజితులు ముందుకు వస్తారు.

## వ్యాపారంలో క్విక్ రేష్యో

వ్యాపారంలో ప్రస్తుత ఆస్తులకు, ప్రస్తుత ఋణాలకు గల నిష్పత్తిని "క్విక్ రేష్యో" అంటారు.

## వైల్డ్‌కాట్ ఆయిల్ వెల్

వైల్డ్‌కాట్ ఆయిల్ వెల్ అనే బావి నూనెకోసం త్రవ్వబడిన బావి. విజయం సాధ్యవంతంగా ఉండవచ్చు

## మే వెస్ట్ అంటే?

మే వెస్ట్ (Mae West) గాలి పూరించిన లైఫ్ జాకెట్. దీనికి సుప్రసిద్ధ అమెరికన్ నటి పేరు పెట్టబడింది.

## MIG పూర్తి పేరు

రష్యన్ జెట్ ఎయిర్‌క్రాఫ్ట్‌ను రూపొందించిన మికొయాన్ మరియు గురెవిక్ సంకేత నామము M.I G

## వైట్‌షీప్ ఎవరు?

మంచి నైపుణ్యంతో స్కిప్పింగ్ చేయగల వారిని వైట్‌షీప్ అంటారు

## మిక్కిలి ప్రసిద్ధి పొందిన పాట

ప్రపంచంలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన పాట 'హాపీ బర్త్‌డే టు యు' దీనిని మొట్టమొదట కెంటుకీ లూయిస్‌విల్లీ (యుఎస్ఎ)లో నివసించే ఇద్దరు ఉపాధ్యాయులు మిల్‌డ్రెడ్ మరియు పాటీ హిల్ రచించారు *1893లో ఇది మొట్టమొదట 'గుడ్ మార్నింగ్ టు యు' అనే శీర్షికతో అచ్చువేయబడింది 1935లో మొదటి రెండు మాటలు మార్చిన 'హాపీ బర్త్‌డే టు యు' గొప్ప హిట్‌గా పరిణమించింది.*

"ప్రయత్నం చేయనివాని కంటె, సాహసించువాడు ఉత్తముడు."

## టు కిక్ సమ్‌వన్ అప్‌స్టెయిర్స్

టు కిక్ సమ్‌వన్ అప్‌స్టెయిర్స్ అంటే ఒకరిని తక్కువ అధికారంతో పెద్ద పదవికి నియమించడం.

## 'S'కు అర్థం లేదు




మాజీ అమెరికా అధ్యక్షుడు హేరీ S ట్రూమన్ పేరులో 'S' అనే అక్షరానికి అర్థం ఏమీ లేదు

## మిష్నా అంటే?

తాల్‌ముడ్ ప్రాతిపదికగా జ్యూల మౌఖిక మైన చట్టాన్ని అనుసరించి సంగ్రహించబడిన విధులు "మిష్నా" (Mishna)

## 5వ, 55వ వైవాహిక వార్షికోత్సవాలు

5వ మరియు 55వ వైవాహిక వార్షికోత్స వాలను వుడ్ మరియు ఎమరాల్డ్ ఉత్సవాలు అంటారు.

## ఒకే సమంగా ఉండే కవలలు

ఒకే సమంగా ఉండే కవలలు ఒక్క వ్రేలి ముద్రలలో తప్ప అన్నివిధాలా సమంగా ఉంటారు

## మొట్టమొదటి జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత

ప్రఖ్యాత జ్ఞానపీఠ్ అవార్డును మొట్ట మొదట పొందినవారు జి శంకర కురూప్.

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

క్విజ్: 1 బాక్టీరియా సూక్ష్మజీవుల కంటే చిన్నవిగా ఉండి శరీర కణజాలంలో వృద్ధి పొందే రోగ కారకం, 2 నెపోలియన్ III - ఫ్రాన్స్ చక్రవర్తి అయిన నెపోలియన్ I మేనల్లుడు, 3 విశ్వ సంరక్షకమైన సంతోషాతిశయం, 4 మణిపూర్ రాజధాని ఇంఫాల్, 5 వెల్లూర్, జింజీ, ఫోర్ట్ సెంట్ జార్జ్, ట్రాన్‌క్యెబార్, 6 కోకిల, 7 రెడ్ ఇండియనులు

మాటల మహిమ: 1 (ఎ) మూర్ఖుడు, (బి) మోటువాడు, (సి) విరసుడు, (డి) ముదుకది, 2 (ఎ) రోత, (బి) జుగుప్స, (సి) హెచ్చరిక, (డి) ఏకాగ్రత, 3 (ఎ) కొరత, (బి) లోపము, (డి) అరమర; 4 (ఎ) సామ్యము, (బి) అనుగుణము, (సి) వెనుకబడు, (డి) వయస్సు; 5 (ఎ) మిక్కిలి వేగము, (బి) పరాక్రమము, (సి) శౌర్యము; 6 (ఎ) వంటకై నీరు మరగబెట్టు, (బి) హాని కలిగించు, 7 (ఎ) పూర్తిగా, (బి) అనాయాసంగా, (సి) ఎక్కువగా, (డి) అవలీలగా; 8 (ఎ) అకస్మాత్తుగా, (బి) హఠాత్తుగా

తెలివికి పరీక్ష: 1 ఈతకు, 2 SWEDEN, 3 వీరందరూ బ్రిటిష్ ప్రధాన మంత్రులే, 4 బాదరబందీలు, 5 లంక మేత గోదావరి ఈత, 6 బలితలమోపిన పాదము.

"ముఖంలో చిరునవ్వు ఉంటేగాని నీ అలంకారం పూర్తికాదు."

## మాయన్మార్ వేరు చేయబడింది

మాయన్మార్ (బర్మా) 1937 లో బెంగాల్ నుండి వేరుచేయబడింది.

## మెజీషియన్ ఆఫ్ ఐరన్




ఫ్రాన్స్‌లో ఈఫిల్ టవర్‌ను నిర్మించిన ఎలగ్జాండ్రె - గుస్టావె ఈఫెల్‌ని మెజీషియన్ ఆఫ్ ఐరన్ అనేవారు

## ఒనిరోమాన్సీ అంటే?

ఒనిరోమాన్సీ (Oneiromancy) ఒక విధమైన అదృష్ట సూచన. ఈ విధానంలో స్వప్నాలను విశ్లేషిస్తారు.

## మైసాలజీ అంటే?

మైసాలజీ - విజ్ఞానం, విమర్శ, చర్చ అంటే ద్వేషం ●

## ఆంటీసెప్టిక్ సర్జరీ

లార్డ్ లిస్టర్ (1827-1912) ఆంటీసెప్టిక్ సర్జరీని కనిపెట్టాడు. ఇతడు ఆంటీసెప్టిక్ స్ప్రేలు మరియు డ్రెస్సింగ్‌లను ఉపయోగించి హాస్పిటళ్ళలో అంటు రోగాలను నివారించాడు.

# అంతరిక్షంలో

## మొట్టమొదటి అంతరిక్ష ప్రమాదం

*మొట్టమొదటి అంతరిక్ష ప్రమాదం 1967 ఏప్రిల్ 24 న సంభవించింది 40 సంవత్సరాల సోవియెట్ కాస్మోనాట్ వ్లాడిమిర్ కొమరోవ్ ప్రయాణం చేసిన అంతరిక్షనౌక సోయూజ్ I కక్ష్యను వదలి భూమి మీదికి వచ్చినప్పుడు అతడు మరణించాడు*

## అంతరిక్ష కక్ష్యలో ప్రవేశించిన మొదటి అమెరికన్

*1962 ఫిబ్రవరి 20 న మొట్టమొదటి అమెరికన్ కక్ష్యలో ప్రవేశించాడు ఇతడే యు.ఎస్ మెరైన్స్‌కు చెందిన లెఫ్టినెంట్ కల్నల్ జాన్ గ్లెన్. 'ఫ్రెండ్ షిప్ 7' అనే ఇతడి మెర్క్యురీ (Mercury) తరహా అంతరిక్షనౌక ఒక మనిషికి సరిపోయే చిన్న నౌక కల్నల్ గ్లెన్ అట్లాంటిక్ మహాసముద్రంలో భద్రంగా దిగడానికి ముందు భూమి కక్ష్యచుట్టూ పూర్తిగా మూడుసార్లు తిరిగాడు.*

## ప్రపంచంలో మొట్టమొదటి ఉపగ్రహం

*1957 అక్టోబర్ 4 న సోవియెట్ యూనియన్ ప్రపంచంలో మొట్టమొదటి అంతరిక్ష నౌక 184 పౌండ్ల స్పుట్‌నిక్ 1 ని కక్ష్యలోకి ప్రవేశ పెట్టినప్పుడు అంతరిక్ష యుగం ప్రారంభమైంది మూడున్నర సంవత్సరాల తరువాత మొట్టమొదట మానవుడు అంతరిక్షంలోకి వెళ్ళాడు. 1961 ఏప్రిల్ 12 న మేజర్ యూరీ గగారిన్ 4 1/2 టన్నుల భారం తూగే అంతరిక్షనౌక వోస్టాక్‌లో భూమి కక్ష్యలో తిరిగాడు.*

## స్పుట్‌నిక్ II లో పాసింజరు

*లైకా అనే రష్యన్ కుక్క స్పుట్‌నిక్ II పాసింజరుగా 1957 నవంబరు 3 న పంపబడింది. అది 1,050 మైళ్ళు ఎత్తుకు వెళ్ళింది.*

"మనిషి పెద్దతనం ఉద్యోగం బట్టి కాదు, ప్రవర్తన బట్టే తెలుస్తుంది"

# భ్రమావరోధాల్ని ఛేదించుకో

జపాన్ వేడుకలు, సంబరాలలో ఈగల సర్కస్ చాలా వింతగా ఉంటుంది ఇందులో ఈగలు, జోరీగలు విపరీతంగా గంతు లేస్తూంటాయి ఎంత జోరుగా ఎగిరినా అవి ఒక నియమిత ఎత్తును దాటి పైకి ఎగురవు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది



ప్రతి ఈగ కూడా తన చుట్టూ ఊహాత్మకమైన ప్రతిబంధకాన్ని నిర్మించుకుంటుంది ఎందుకో తెలుసా? ఈ ఈగలని, జోరీగలని చిన్నప్పటి నుంచీ పెద్ద గాజు డోము క్రింద చాలా రోజులు ఉంచుతారు. కాబట్టి ఆగాజు డోము తీసివేసిన తరువాత కూడా గాజు డోముపైన ఉంది అని భ్రమపడతాయి. ఆ ఊహాత్మకమైన గాజు డోము పైకి వెళ్లవు.

దురదృష్టవశాత్తు మనలో ఎంతోమంది ఈ ఈగలు లాగా, జోరీగలు లాగా ఉంటారు కంటికి కనిపించని పరిసర అవరోధాన్ని నిర్మించుకుంటారు దాన్ని దాటి వెళ్లరు ఇటువంటి వారికి వారి చిన్నతనంలో తలిదండ్రులు కొన్ని అవరోధాలు కల్పిస్తారు దీనికి అలవాటు పడి పోయి ఉంటారు పెరిగి పెద్ద అయిన తరువాత కూడా ఏ అటంకాలు, అవరోధాలు లేకపోయినా కూడా ఊహానిర్మిత అవరోధాన్ని పడగొట్టుకోలేక పోతున్నారు భావనాశక్తిని వినియోగించుకో లేకపోతున్నారు

ఇటువంటివి జరుగనీయకు ఊహా ప్రపంచం నుంచి బయటపడు నీ ఆలోచనా పరిధిని విస్తరింపచేసుకో సంకుచితం చేసుకోకు కనిపించని భ్రమావరోధాలను ఛేదించుకో! విస్తృత ప్రపంచంలో స్వేచ్ఛగా విహరించు ●

## బహుముఖ పోరాటం


DR S RADHAKRISHNAN

ప్రపంచంలో ఇతర ప్రదేశాలలో అనేక శతాబ్దాల పాటు విస్తరించుకున్న విప్లవాత్మక ఉద్యమాలు మనదేశంలో అనతికాలంలో తీవ్రతరం అయ్యాయి వీటిని మనం రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా బహుముఖంగా ఎదుర్కోవలసి వస్తుంది. సాంఘిక మరియు ఆర్థిక రంగాలలో సంభవించే తీవ్రమైన ఈ మార్పులను ఎదుర్కోడానికి మన విద్యార్థులకు విద్య నేర్పడం ఒక్కటే మార్గం కాలాభివృద్ధితో పాటు ప్రగతి చెందకపోతే దేశాలు వెనుకబడిపోతాయి.

— డా ఎస్ రాధాకృష్ణ

"అలవాట్లు మానవుని తినేస్తాయి కనుక వివేకంతో చెడ్డ అలవాట్లు నుండి మనం తప్పించుకోవడం ధర్మం"

# విశ్వాసమే బలం

## స్వామీ వివేకానంద

విశ్వాసానికి, బలానికి గుర్తుంచుకోవలసిన పది సూత్రాలు ·

● ఈ ఆత్మకు ఏదీ కూడ అసాధ్యమని ఎప్పుడూ అనుకోకు. అలా అనుకోవడం సంప్ర దాయ విరుద్ధం. ఏదైనా పాపం అనేది ఉంటే నువ్వు శక్తి హీనుడవని అనుకోవడం, ఇతరులు శక్తిహీనులు అనుకోవడమే మహాపాపం


VIVEKANANDA

● నీవు ఎలా భావిస్తావో అలా ఉంటావు. నీవు నిర్బలుడవు అని అనుకుంటే నీవు నిర్బలుడవే. నీవు బలవంతుడవు అని అను కుంటే నీవు బలవంతుడవే.

● ఎప్పుడూ 'కాదు' 'నాచేతకాదు' అని చెప్పకు. నీప్రకృతి స్వభావంతో కాలావధులు ఎన్నటికీ సరితూగవు. నీవు శక్తి సంపన్నుడవు. నీవు అన్నీ చేయగలవు, ప్రతీది చేయగలవు.

● పిరికితనానికి నివారణ అధైర్యంతో, విచారంతో కూర్చోడం కాదు ధైర్యాన్ని గురించి ఆలోచించు. ధైర్యవంతులకు వారిలో ఉన్న ధైర్యాన్ని గురించి చెప్పు.

● నీవు ఎంతో బలిష్ఠుడవు. బలానికి స్పందిస్తావా? నాకు తెలుసు సత్యం బలాన్ని చేకూరుస్తుంది ప్రపంచ రుగ్మతకు బలమే ఔషధం.

● దిగ్విజయం పొందాలంటే బ్రహ్మాండ మైన పట్టుదల, సంకల్పం అవసరం. పట్టు దలగల ధైర్యవంతుడు "సముద్రాన్నంతా తాగేస్తా, కొండలు పిండి అయిపోతాయి" అంటాడు. అటువంటి శక్తి సామర్థ్యాన్ని అలవాటు చేసుకో. మనస్ఫూర్తిగా కష్టించి పనిచేయి. లక్ష్యాన్ని పొందుతావు

● నిరర్థక జీవనం కంటే మరణం ఎంతో మేలు పరాజయంతో జీవించడం కంటే యుద్ధభూమిలో మరణించడం ఉత్తమం.

● లోకులు కాకులు కాకి గోలకు వెనుదీయకు దృఢవిశ్వాసంతో నీపని పూర్తిచేయి. అప్పుడు వారు నీ కాళ్లపై పడతారు. ప్రప్రథమంగా ఆత్మ విశ్వాసం ప్రవృద్ధి చేసుకో. ఆత్మ విశ్వాసంలోనే అంతా ఉంటుంది. నీలో ఎంతో శక్తి దాగి ఉంది "నేను చేయగలను" అని ధైర్యంగా చెప్పుకో

● ఇదొక బ్రహ్మాండమైన విషయం. ధైర్యమే జీవితం. పిరికితనం మరణం. ధైర్యం అభినందనీయమైనది, నిరంతరమైనది, నిత్యమైనది. అధైర్యం విచారవంతమైనది, నిరంతర ఒత్తిడిని కలిగిస్తుంది, దుఃఖమయము.

● లేచినిలబడు పోరాడు. వెనుకకు అడుగు వేయకు. ధైర్యంతో ఎదుర్కో, ఏం సంభవించినా, ప్రపంచమంతా వ్యతిరేకంగా ఉన్నానరే. మరణం అనేది బట్టల మార్పిడి వంటిది.

"విమర్శకు పూనుకుంటే ప్రేమించుటకు అవకాశం ఉండదు"

# సినీమా రంగం

## మొట్టమొదటి తెలుగు చిత్రం

దక్షిణ ఇండియాలో నిర్మించిన మొట్ట మొదటి తెలుగు చిత్రం 'సీతాకల్యాణం'లో రామతిలకం నటించింది ఇది 1934లో వేల్ పిక్చర్స్ లిమిటెడ్, మద్రాసు వారికి పి.వి దాస్‌చే నిర్మించబడింది




## దక్షిణ భారతదేశంలో నిర్మింపబడిన మొదటి టాకీ

ఎ నారాయణ్ (1934) తమిళంలో నిర్మించిన శ్రీనివాస కల్యాణం దక్షిణ భారత దేశంలో మొట్టమొదటి టాకీ ఈ చిత్రంలో ఆర్.బి. లక్ష్మీదేవి నటించింది

## కన్నడంలో మొట్టమొదటి టాకీ

మాస్టర్ ముత్తు మరియు కనకలక్ష్మిదేవి నటించిన 'ధృవకుమార్' 1943 లో జయవాణీ టాకీస్ నిర్మించిన మొట్టమొదటి కన్నడ టాకీ చిత్రం

## భారతదేశపు మొట్టమొదటి ఫుల్‌లెంగ్త్ వ్యంగ్య చిత్రం

భారతదేశపు మొట్టమొదటి ఫుల్‌లెంగ్త్ వ్యంగ్య చిత్రం (cartoon picture)- 'బాంబూ' 1939 ఆగస్ట్‌లో రిలీజ్ కాబడింది.

## ఆంగ్లంలో మొట్టమొదటి భారతీయ టాకీ

'కోర్ట్ డాన్సర్' భారతదేశంలో మొట్ట మొదటి ఇంగ్లీష్ టాకీ సాధనా బోస్ నటించిన ఈ చిత్రాన్ని 1941 లో వాడియా మూవీటోన్ వారు నిర్మించారు

## మొట్టమొదటి భారతదేశపు పూర్తి వర్ణచిత్రం

బొంబాయి ఇంపీరియల్ ఫిల్మ్ కంపెనీకి చెందిన ఆర్దెషిర్ ఇరానీ నిర్మించిన 'కిసాన్ కన్య' మొట్టమొదటి భారతదేశపు పూర్తి వర్ణ చిత్రం ఇది 1938 జనవరి 8 న రిలీజ్ కాబడింది ●

## నిర్దుష్టమైన సంస్థ

*ఒక సైనికుడు చిన్నగాయంతో చికిత్సకు హాస్పిటల్‌కు వెళ్లాడు. అక్కడ రెండు ద్వారాలను చూసాడు ఒక ద్వారం మీద 'ఆఫీసర్స్' అని, ఇంకొక ద్వారం మీద 'ట్రూప్స్' అని గుర్తించబడ్డాయి ఇతడు 'ట్రూప్స్' అని ఉన్న ద్వారం గుండా వెళ్లాడు అక్కడ తిరిగి 'తీవ్రంగా గాయ పడ్డవారు' 'కొద్దిపాటి గాయం తగిలినవారు' అని గుర్తింపబడిన రెండు ద్వారాలను చూసాడు ఇతడు 'కొద్దిపాటి గాయం తగిలిన' ద్వారం గుండా వెళ్లాడు అక్కడ తిరిగి 'పార్టీ మెంబర్లు', 'నాన్ పార్టీ మెంబర్లు' అని గుర్తించబడిన రెండు ద్వారాలను చూసాడు. ఇతడు 'నాన్ పార్టీ మెంబర్లు' అని గుర్తించబడిన ద్వారం గుండా వెళ్లాడు అక్కడ నుంచి రోడ్డు మీదికి చేరుకున్నాడు. సైనికుడు ఇంటికి చేరుకున్న తరువాత ఒక స్నేహితుడు 'హాస్పిటల్లో ఏం చికిత్స చేసారు?' అని అడుగగా దానికి అతడు 'ఏ చికిత్సా చేయలేదు కానీ సంస్థ మాత్రం చాలా నిర్దుష్టంగా ఉంది' అన్నాడు.*

"ఒకసారి వివాహం చేసుకోవడం ధర్మం, రెండుసార్లు అవివేకం, మూడుసార్లు ఉన్మాదం."

# జీవితంలో కష్టాలనుండి ధైర్యం తెచ్చుకో

స్వామీ జ్యోతిర్మయానంద

మానవ జీవితంలో సుఖాల కంటే కష్టాలే అధికం. బాల్యం నుంచి వృద్ధాప్యం దాకా మానవులకు ఎన్నెన్నో తీరని అభిరుచులు, కోరికలు, భగ్నమైన ఆశయాలు, ఆశలు.



మీలో చాలామంది జీవితంలో సంభవించే కష్టాలను తట్టుకోవడానికి సిద్ధమై ప్రయత్నించాలి. సిద్ధంగా ఉన్నా లేకపోయినా ప్రతీ మనిషికి కష్టాలు తప్పవు - నిజానికి జీవితంలో కలిగే కష్టాలకు ఎంతో ప్రాధాన్యత, ప్రాముఖ్యత, ప్రభావం ఉంది. వాటి అంతరార్థాన్ని గ్రహించ గలిగితే వాటి వల్ల మీకు ఏ అపకారం ఉండదు. ఏ చెడుపు కలుగదు. మీకు దృఢ విశ్వాసం, పట్టుదల, ధైర్యం, ఓపిక, ఓర్మి అలవడుతాయి.

బాధ అనేది మానవ పరిణామానికి తప్పనిసరి. దుఖాలతో, క్లేశాలతో పరిశుద్ధం కాని హృదయాలకు అవిచ్ఛిన్న శాశ్వత విజ్ఞానం ఉండదు. హృదయ దౌర్బల్యం పొందకూడదు బాగా ఆలోచించి గ్రహించండి. తెలుసుకోండి. 'ఇది కూడా గతించి పోతుంది, ఎప్పటి కంటే ధైర్యంగా ఉండగలను' అని ధైర్యం తెచ్చుకోండి.

దుఃఖం కనువిప్పు. దుఃఖం వేదాంతాన్ని నేర్పుతుంది దుఃఖం దేవుడిని జ్ఞాపకం చేస్తుంది. దుఃఖం లేనప్పుడు, కష్టం లేనప్పుడు పరమాత్ముని స్మరించు దాని ఫలితంగా నీకెన్నడూ దుఃఖం సంభవించదు.

జీవితంలో ఏదో అసంభవం, ఆటంకం కలిగిందని నీపనిని మానకు. ఎన్నడూ నీ ఉద్యమం విరమించకు. అవకాశాల కోసం నిరీక్షించకు. వర్షపు చినుకులు పడకుండానే నీవు విత్తనాలు నాటు. ఎవరికి తెలుసు వాన రాకడ, ప్రాణం పోకడ.

జీవితంలో కష్టసమయాలలో హృదయ క్షేత్రాన్ని సిద్ధం చేసుకో - మంచి భవిష్యత్తు ఉదయిస్తుంది వియోగాలు - సంయోగాలు, కూడికలు - చేరికలు, లాభాలు - నష్టాలు, కష్టాలు - సుఖాలు అన్నీ కూడా సముద్రంలో కెరటాలు లాగా లేస్తాయి నీవు మహా సముద్రం. నీ ఆత్మ సాగరాన్ని అవగతం చేసుకో, జీవితంలో కష్టాలను నిర్వర్తించుకో.

●

## ఆరోగ్యసూచనలు

* కాలిజోళ్ళు కొనేటప్పుడు మధ్యాహ్నం గానీ, సాయంకాలం కానీ కొను అప్పుడే పాదాలు బాగా విస్తరించుకుని ఉంటాయి.

* పాదాలు సులభంగా అలసిపోతే ఒక కుర్చీలో కూర్చుని కాళ్ళుజాపి పాదాలను చేతులతో పట్టుకో. వాటిని మెల్లిగా రెండు ప్రక్కలకూ త్రిప్పు.

"సంతోషంగా నవ్వుతూ ఉంటే ప్రార్థన కంటే
పరమాత్మునికి ఎక్కువ చేరువగా ఉంటాము."

# చెత్తా చెదారం నుంచి గ్యాస్

ప్రపంచంలో సౌభాగ్యవంతమైన దేశాల నగరాలలో చేరిన చెత్తా చెదారం సాలీనా మిలియనుల కొద్దీ పీపాల అమూల్యమైన నూనె నష్టానికి సూచకం

నవ్య మరియు పునర్వ్యవస్థీకరణ యోగ్యమైన శక్తి మీద యునైటెడ్ నేషన్స్ కమిటీవారి పరిశీలన ప్రకారం యునైటెడ్ స్టేట్స్‌లో ప్రతీ సంవత్సరం ప్రోగయ్యే 240 మిలియను టన్నుల మునిసిపల్ చెత్తలో 340 మిలియను పీపాల నూనెకు సమానమైన విద్యుచ్ఛక్తి ఉంటుంది. తిరిగి ఉపయోగించుకోడానికి ఈ తుక్కులో వీలైన అల్యూమినియం, ఇనుము, గ్లాసును తిరిగి ఉపయోగించుకోగలిగితే సాలీనా మరో 175 మిలియను పీపాల నూనె ఆదా చేయవచ్చు

ప్రపంచ వ్యాప్తంగా చెత్తా చెదారం పరిష్కారానికి అయ్యే ఖర్చులు విపరీతంగా పెరిగిపోతున్నాయి నేటికీ సర్వసాధారణమైన పరిష్కార విధానం పల్లపు భూములను నింపడమే. కానీ సక్రమంగా ప్రతీరోజూ దీనిని మట్టితో కప్పుతూండాలి చెత్త నీరు భూమిలోకి దిగకుండా జాగ్రత్త పడాలి దీనికి టన్నుకి సుమారు రూ 500 మొదలు రూ 1500 వరకు వ్యయం అవుతుంది. నగర సంబంధమైన చెత్తను మంట బెట్టడం వల్ల విషకరమైన భారీ లోహాలు, గాస్‌లు, పొగ వాతావరణంలోకి వదలబడతాయి. కానీ ఈ చెత్తను వేరు పరచి ప్రత్యేకంగా రూపొందించబడిన ఫర్నేసులులో మంటబెడితే ఎంతో లాభవంతంగా ఉంటుంది ఇటువంటి ఫర్నేసులు వల్ల (ముఖ్యంగా చెత్త కాగితం) ఉద్భవించే ఉష్ణాన్ని నేరుగా పరిశ్రమలకు ఉపయోగించుకోవచ్చు లేక విద్యుత్తును జనింప జేసుకోడానికి ఉపయోగించుకోచ్చు ఒక కిలోగ్రాం న్యూస్ ప్రింట్ కాలిస్తే ఒక కిలో బొగ్గును మంట బెట్టినప్పుడు వచ్చే దాంట్లో 65 శాతం శక్తి ఉత్పన్నమవుతుంది

భూమిమీద పేర్చిన చెత్తను కూడా వినియోగించుకోవచ్చు. ఇది కాలక్రమేణా చీకి క్రుళ్లడం వల్ల దీనినుండి వచ్చే మిథేన్ గాస్‌ను వేరు చేసుకుని దానిని విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు ఉపయోగించవచ్చు

— 'సిఇఇ -ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## ఒత్తిడికి విరుగుడు హాస్యం



*ఒత్తిడికి విరుగుడు మందు హాస్యం. మనలో ఉండే హాస్య స్వభావం లోకంలో ప్రజలను సరళవంతం చేస్తుంది 'నాకు హాస్య స్వభావం లేకపోతే నేను ఏనాడో ఆత్మహత్య చేసుకునే వాణ్ణి' అని ఒకసారి గాంధీజీ అన్నారు. 'పగలనక రాత్రనక నాలో కలిగే ఒత్తిడికి నేను నవ్వలేకపోతే మరణించి ఉండేవాణ్ణి' అని లింకన్ అన్నాడు.*

"అడిగి తెలుసుకోవడానికి భయపడేవారు నేర్చుకోడానికి సిగ్గుపడతారు."

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT
*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084)*

